శ్రీ రస్తు.

---

శ్రీశారదాంబాయనమః

# సుజ్ఞానతత్త్వ పూర్ణోదయం బను
# బ్రహ్మగీతా రహస్యము.

ఇయ్యది


శ్రీమద్గార్గీపుత్రవంశ పయఃపారావార

రాకా సుధాకరాయమాన శ్రీవిష్ణుగోత్ర సంభూత

ముత్యాల- రామస్వామియోగి పుత్రుండును

శ్రీమార్గ- దైవశిఖామణియును

దిగంబరేశ్వర స్వాములవారి ప్రియశిష్యుండును

నెల్లూరుజిల్లాలో చేరిన నారాయణరెడ్డిపేట

నివాసస్థుండును నగు

ముత్యాల - నారసింహ యోగీంద్రునిచే

రచియింపబడి



చెన్నపట్టణము పాతచాకలపేట యందుండు

పద్మ- త్యాగరాయ సెట్టిగారి

శ్రీరాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షర శాలయందు

ముద్రింపించి ప్రకటింపబడియెను.

1909



— (వెల 0-8-0.




అయ్యలారా?

బ్రహ్మావిష్ణు మహేశానాం భారతీం జలజాలయాం। కాత్యాయనీ మహాదేవం ధ్యాయే దీప్సితసిద్ధయే॥

శ్రీరామచంద్ర కరుణాకర దీనబంధో। సీతాసమేత భరతాగ్రజ రాఘవేశ। పాపార్తిభంజన భయాతురదీనబంధో। పాపంబుధౌ పతితముద్ధర మామనాథమ్॥

నమశ్శివాయ సర్వాయ ప్రాప్యప్రాపక రూపిణే। తత్త్వబోధ నిష్ఠాయ కలికల్మష హారిణే॥

శ్లో॥ అంతర్జ్యోతి ర్బహిర్జ్యోతిః ప్రత్యగ్జ్యోతిః పరాత్పరః। జ్యోతిర్జ్యోతి స్స్వయంజ్యోతి రాత్మజ్యోతి శ్శివోస్మ్యహమ్॥

వ॥ శ్రీమదనంత నిగమాంత పరితత్త్వార్థ ప్రకాశమాన భక్తజన మనన నిధి ధ్యాన పఠన యుక్తంబును మృదుమధుర శైలిగలిగి సులభ సంస్కృతాంధ్రపద సముదాయంబై వినువారలకు శ్రోతవ్యమై మోక్షార్థులకు ముక్తిప్రదాయకమై స్వానుభవులకు కేవల పరిపూర్ణ కుమూహాల దాయకమై య్యుగ్గళించునట్లు శ్రుతిస్మృతిపురాణేతిహాసానుగుణ్యంబై యుపనిషదధ్యాత్మిక సమ్మతములగుం గొన్ని వేదాంత గ్రంథమ్ములలోని శ్లోకములతో నాంధ్రి పద్యియున్నా

మెలంకువతోడ సేకరించి సప్పటప్పట నుపమానోపమే
యముల నుపకరింపఁగ్గిలించి (సుజ్ఞానతత్త్వ పూర్ణోదయం)
బను పేరంబరగెడు బ్రహ్మగీతా రహస్యమను నిష్పరమాప్త
తత్త్వజ్ఞాన మార్జింపం దొడఁగు ముముక్షువులకై సత్యాం
తోప యుక్తంబుగా నంతర్యాది నిశ్చయతత్త్వము ప్రత్యక్ష
ముగా హృదయమ్మున చిత్రాపం జేయుమన నదిసిలంపే నద
నుకించి యుపన్యాసయుక్తంబులగుం గొన్ని విశేషంబులఁ
తేనెసోనయై గగ్రాంకురంబునస్రవించి రుచిబుట్టించుచుండు
తెలుంగున సర్వజనమనోభి రామంబుగా క్రోడీకరించు విధా
నం బెట్టనిన= ఈయిహలోకంబున మానవులమై జన్మించుట
దుర్లభంబై యున్నను పూర్వజన్మ పుణ్యపరిపాకం బానగూ
డుటచే మానవులమై జన్మించియున్నారము ఇట్టి జన్మమం
దు మనము జీవించుతఱి బాల్య, యౌవ్వన, కౌమార, వార్ధ
క్యంబులు క్షురీ వేగతుల్యంబులై గ్రసింపుచుండుటం జేసి మఱి
మంతులమై సమస్తపురుషార్థములలో మూలంబై స్వర్గశ్రేయ
స్సాధనంబై శాంతికేముపి గరిష్ఠవిజృంభిత జ్ఞానమై సేరి
నైక నిష్కామ కర్మానుష్ఠానాభ్యుతి రావమంది ఆగామి
సంచిత ప్రారబ్ధముల నుగ్గాడెడు తెలుంగులింగి పరిశృత మా
నసేంద్రియ మీ దేహ వరియంటి మోహాటంచకే పరమగురు
పరుసన్నిధికిఁ జేరంజని భయభక్తి వినయ సంభ్రమంబున
ఆయ శిరస్సాష్టాంగ దండప్రమాణంబు లాచరించి కరగాత్ర
లమై సాధనానుభవసిద్ధిఁ గృహసూత్రకాని గాఢాంధకారము

హస్తి మస్తిష్కము గోరుచుండుటతి మనమెల్లరము ధైర్య సాగర సత్స్వాను రూపంబయినఫలంబే వాంఛించి అనిర్వచనీయ కళ్యాణగుణ సంపూర్ణ విజ్ఞానసంయోగానుభవ మందేది యుజ్వలంబున యోగారూఢంబగు గద్దియపై నెక్కి ద్వైతవృత్తిగల యజ్ఞాన తిమిరంబును కృతకృత్యులమై వేడి వెల్పున కల్పించి వశింపుచేసి కొనుచుంటయే యనర్ఘమగు బ్రహ్మానంద పదవి అంపిల్లునని వేదంబులు ఘోషించుచున్న యవిమెట్టి ప్రజ్ఞావంతుండైనను పేటికాంతర్గత రత్నముంబోలె సుజ్ఞానతత్త్వపూర్ణోదయ సిద్ధిన్పొందక ప్రకాశింపజాలడు ధీమంతులగు విశారదులకు జితేంద్రియత సుగమ్మమై యుండు తురంగమాతంగాదులు చెప్పినయర్థము గ్రహించి వాహనాది కార్యంబులందు ప్రవర్తిల్లుచున్నయవి నీచమతి వ్రాతంబులవలె మాయ లుపచరించక సాధనచతుష్టయ సంపత్సిద్ధియగు ఋజుమార్గం బవలంబించి యుత్సాహసాహసంబు వినుమతింపం బూనియుండందగు సల్లావర్పక లభ్యంబైన జ్ఞానరత్నంబు నెడబాసెడు మందభాగ్యుల కవశ్యము హానిసంభవమై యముని పాలిటి గొఱ్ఱెలరై బుట్టి గిట్టుటలకు మూలంబేయగుగాన ధర్మంబదటగలవారు నాచరించందగు నాచరించెడువారంత (బ్రహ్మవిద్యా పరిజ్ఞానం బ్రహ్మప్రాప్తి కరంపరం) బనువేదోక్తి ప్రకారం పురాతన జనసత్కృత పరిపాకంబానగూడిసిద్ధించెడి సుజ్ఞానోదయముచే హృదయాంతర్గత ఫలోల్లాస బ్రహ్మానంద పరిపూర్ణమగు నం

ద పానమగ్న తజ్జైంది నోలలాడవచ్చుగాన మనముతలపడి గురూపదేశ సాధనసిద్ధిలో మున్నవై జితేంద్రియుల నార్జించి చిదఖండానందాద్వయ పరబ్రహ్మాత్మక సంయోగ శిష్టులమై మనోదుష్కర్మల తుదముట్టనే సెడి నభ్యాసపాటవంబున తూష్ణీకులమై తోష్ట్రేద నిర్విణ్ణులమై బహిర్లిఖించి ప్రకాకారంబువగిది బ్రహ్మానంద మగ్నులమై ప్రాక్తన కర్మఫలంబుల తుదముట్టఁజేయుచు నిత్యనిర్గుణ సత్యపరిపూర్ణంబైన గుప్తంబగు నుదాసీనుని మనోల్లాసంబుగా వర్ణించి (అహంబ్రహ్మాస్మి) యను వేద న్యాయానుభవంబంది గ్రాలుచుంటయే ఏకపదంబైనముక్తి అట్టిసత్యజ్ఞాన మార్జించుటలో (అలస్యాదమృతంవిషం) బనునార్యోక్తి ప్రకారము త్వరపడి సుజ్ఞానమార్జించక పోయిన నిహపరలోక దూరులమై మరణకాలంబున దూదిం చిచ్చుదాచిన చందంబుగా దండధరుని పాల్బడి మోహంబను యమృతంబువదలి జనన మరణంబులగు కాలకూటంబుమ్రింగి కడతేరుట దుర్లభంబై (పునరపిజననం పునరపిమరణం పునరపిజననీ జఠరేశయనం) బనురీతిగా దుఃఖైకసాగర నివాసులమై యెన్నియు పరిసంహారము లొనర్చినను నిరర్థకంబులై పోవుచుండుగాన శ్రీగురుమూర్తి దిగంత విశ్రాంతకీర్తివంతుండు మనలధమ్ములఁ జేయం జాలియుండునట్టి మహానీయ్యాని పాదకి కరణ్యులమైనచో ప్రతిఫలంబు కందవచ్చునని తలంచి నిదమాకించి గ్రంథరాజమ్ము వేముమకువులకు జనేశ్వర

జగత్తులనెఱింగెడి కౌసల్యత్వము తోడ్పడునట్లు ప్రోత్సాహము గలుగఁజేయం జాలుదునని వాగ్గ్సదుమధుర స్ఫుటానుభవరసా స్తుతులు ముప్పిరిగొన నిండించి సర్వవిబుధ ప్రపంచంబు సంభావించి రాణింపఁజేయునట్లు భగవంతుని హృదయాంగ భోజమునందు తేజరిల్లఁ స్మరింపుచు రచియించి భద్రమగుటకై ముద్రింపించుటకొగ్గిన పరిమితానంద వార్ధినోలలాడుచు కృతార్థుండ నయ్యెదనని సంకల్పించి ప్రకటింపం బూనినాఁడ నిట్టి యనుభవసారం బధిగమించి అసదృశానుభవ మందెడి యుజ్వలంబున నంగుమీర నియ్యెకొను వారలీ గ్రంథరాజమ్ము తుదముట్టం జదివి కర్ణకుహరంబులచే తన్గ్రహించి నిస్తరంగవార్ధి సమధైర్య సుజ్ఞానతత్త్వపూర్ణోదయ ప్రసన్నచిత్త భరితాంతరంగులరై నాశ్రమము సార్థకంబుగా నుత్కృష్ట పరిపూర్ణ బ్రహ్మానంద సుఖమనుభవించుచుండెదరుగాత.

ఇట్లు,

సకల బుధజన విధేయుఁడు.

ముత్యాల-నారసింహ.యోగి.





శ్రీరస్తు.

శ్రీగణేశాయనమః.

శ్రీరామచంద్రగురు పరబ్రహ్మణేనమః.



# సుజ్ఞానతత్త్వ పూర్ణోదయం బను బ్రహ్మగీతా రహస్యము.



జగద్గురుస్తోత్రము.

హరిః

ఓమ్.

బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం। ద్వంద్వాతీతం త్రిగుణ రహితం తత్త్వ మస్యాది లక్ష్యం। ఏకం నిత్యం మమల మచలం సర్వదీ సాక్షిభూతం। భావాతీతం త్రిగుణరహితం సద్గురు తన్నమామి।

శ్లో॥ గురుబ్రహ్మ గురుర్విష్ణు గురుదేవో మహేశ్వరః। గురుసా
క్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః॥

శ్లో॥ నిరంజనం నిరాకారం దేవదేవం జనార్ధనం । మాయా
యుక్తం జపేన్నిత్యం పావనం సర్వదేహినామ్॥

శ్రీహయగ్రీవస్తోత్రము.

శ్లో॥ జ్ఞానానంద మయందేవం నిర్మలంస్ఫటికాకృతిమ్। ఆధా
రం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే॥

శ్రీవినాయకస్తోత్రము.

క॥ శ్రీకరముగ నిర్విఘ్నము । చేకొనిమొద విఘ్నపతిని చింతిలి
పిదప౯। ప్రాకటముగ సుజ్ఞానవి। వేకము ప్రచురింపబుద్ధి
వితమరినైతి౯॥

శ్రీసరస్వతిదేవి స్తోత్రము.

క॥ శ్రీవాణినజనిరాణిని । వావిరివాగ్జృంభణంబు వరకవితో
క్తుల్। ప్రావీణ్యమూని బలికెదు। త్రోవనువసి గొనుట కేను
తొలుత నుతింతు౯॥

త్రిమూర్తుల ప్రార్థనము.

క॥ పరిపూర్ణనిర్వికల్పము॥ నరయజనించివవిధాత హరిహరుల
నునే। బరికింతువేరువేరుగ । స్థిరమతి గీలింతుస్మరణ స్వేచ్ఛ
గ నెపుడు౯॥

త్రిశక్తుల ప్రార్థనము.

క॥ ముమ్మూర్తులకాది మాయమగు । నమ్మాయను గలుగువాణి
నార్యమలక్ష్మి౯। నెమ్మదిముప్పూరదలచెద। నిమ్మహినాకవి
తచెలగ నింపుగభువిలో౯॥

## స్వగురు స్తోత్రము.

శ్లో॥ నిత్యానందైక కందాయ నిర్మలాయ చిదాత్మనె । జ్ఞానోత్త మాయగురవే సాక్షిబ్రహ్మణేనమః॥

క॥ శ్రీమద్దిగంబరేశగురు। స్వామికివందనముజేసిచర్చిలజ్ఞానం। బాముష్మికశివజీవుల। కేమగునైక్యంబుజెప్పెనోలయంగ కేటికి॥

క॥ తన్మయుని ధన్యమూర్తిని । నున్మనినిత్యమును సమాధి నుండెడువానిన్। జిన్మయగురువరు నెప్పుడు నన్మానస బయలునందు సతతముగొలుతున్॥

సీ॥ శరణు శ్రీపరమదేశిక శరణు శరణు। శరణు బ్రహ్మోపదేశిక శరణుశరణు। శరణుశరణాగతత్రాణ శరణుశరణు। శరణుయస్మద్గురుప్రభో శరణు శరణు।

## కవీశ్వర స్తోత్రము.

గీ॥ శబ్దశాస్త్రమెదో శబ్దబోధలెఱుంగ। శబ్దనుగుణదోష శబ్దమెఱుగ। శబ్దరహితమైన శబ్దములనిరూఢ్మ। శబ్దవిభులమది ని శంసజేతు॥

క॥ అమర శ్రీకాంతలెఱుంగను । క్రమలక్షణకావ్యకయిత కట్టడులెఱుగన్ । యిమిడికయొతిగణప్రాసలు। సమకట్టెడు సంచెఱుంగ సైరింపదగున్॥

క॥ తప్పులుదోచినదిద్దుచు। జెప్పెడుశిష్టులకుశరణు జేయుదునెపుడున్। మెప్పగు వాటినితప్పని। జెప్పెడు చెవటులతో పొందు చింతిల నెపుడున్॥

## గ్రంథకర్త అభిప్రాయ సంగ్రహము.

క॥ శ్రీరాజయోగమందెడు । వారికి నిత్యపరసుఖంబు వరివశ్యము
గదా। వారధినావచెదా లెడు । తీరునసీగ్రంథపఠితి తీరము
జేర్చుఁగా॥

క॥ శ్రీమించు జేయుజ్ఞానము । లోమించక పోవనంత లోకాన్విత
ముగా। దీమించుసగదమించున। క్షేమంబై ముక్తిగదియ జేర్చు
నుభువిలోఁగా॥

క॥ తనుదా దెలియగ నేర్చిన। ఘనయోగీశ్వరుల చరణకమలంబు
లకుఁగా। మునుకొని మ్రొక్కఁగ నేర్చిన। జనవర్యుడు పూజ్యు
డగును జగతినిజూడఁగా॥

క॥ మాయనుమాయము చేయును। పాయముగల దొకటిదాని
పరికించినచో। మాయని గురుభక్తియె మా । చాయగునిల
మాయగెలువ చల చిత్తులకుఁగా॥

క॥ శరణనిగురుపదభక్తిచె। పరమునుసాధింపవచ్చు పదిలముగా
గా। శరణన్న తెలివాయును। శరణన్నను శ్రీలుగల్గు శాత్ర
వమునగుఁగా॥

క॥ శ్రీయుప్వనిసుబోధము గాయకమగు శ్లోకపద్య కందార్థ
ములగా। రోయక చదివినవారికి । బాయకదర్పణముతీరి ప్ర
త్యయమబ్బుఁగా॥

### పరమాత్మమాయా విలాస మహేంద్రజాలాది వర్ణనము.

శ్లో॥ పరేశం పార్వతీకాంతం రమాధీశం దిగంబరమ్ । నిర్మలో
నిత్యతృప్తాత్మా నిత్యానందో మహేశ్వరః॥

శ్లో॥ శరణుశరణు పరబ్రహ్మా। యంత్రమంత్రార్చనావిధి। ఆరో
గ్యమమితాయుష్యమ్ । ఆనందం ఆత్మదర్శనం॥

శ్లో॥ విజ్ఞానంవిధిసుజ్ఞానం। వైరాగ్యం విశ్వరూపకం। అణిమా
ద్యష్టఫలంసిద్ధి। యోగసిద్ధీ మహాత్ఫలం॥

పంచచామరం.— అసంగుడైన బ్రహ్మమందనాది మాయతే
నిడై। ముసుంగు గప్పినట్లునిండి మూలకారణాంశమై।పొసం
గి విశ్వమందుశేరి భూతభౌతికాదులై । మసంగిబుట్టి జివ్వ
చుండు మారుతేకనంతటన్॥

పంచచామరం.— చరాచరంబులంటిమాయ చొకలించి ప్రా
ణులన్। ఝురాఝురీ జనన మరణ బాదలంద జూపుచున్।
తరాతరంబు సాల్వడంగ తార్కిడంగ దానమై। పరాపరా
త్మనంటనివక బ్రాకుచుండు నంతటన్॥

వ॥ ఇట్టిమహేంద్రజాల మాయాకల్పిత మహాభూత పం
చీకృత పంచాశత్కోటి పరివలయితంబై యనేక చిత్రవిచిత్ర
పట్టణ పర్వతారణ్యాపధనదీప్రకాశితంబై నరమృగ పశుపక్ష్యా
ది నానాస్థావర జంగమ లీలావిలాసితంబై స్వర్గమర్త్య పాతాళ
సత్యవైకుంఠ కైలాసాది దివ్య లోకాకారంబై సూర్యచంద్రగ్ర
హ నక్షత్రాలంకృతంబై బ్రహ్మవిష్ణు రుద్ర మహేశ్వరాధిష్ఠి
తంబై ప్రకాశింపుచున్నసీ బ్రహ్మాండమునూహించి జూడజ్జూడ
జగన్నాటక మహేంద్రజాలంబె మైయున్నయది సీయింద్రజాల
మహేంద్ర జాలంబులగు పమ్మాయాయంత్రము హృదయంగ
మమై స్త్రీపురుష రూపంబులతో నటించుచున్న నీప్రపంచము

ను ఏకపటనాటక సూత్రధారి అనిర్వచనీయుండై మాయాసమే
తుండై యన్నింటికి లోపలిదై ప్రకాశింపుచు కాలకర్మ సూ
త్రంబునగట్టి విశ్వమోహినియనెడు మాయ తెరలో బెట్టి నాడిం
చుచు జూచుచు జూడనట్లుండెను జంత్రకారుని స్వప్రకాశుం
డనియును భగవంతుండనియును ఆదిదేవుం డనియును అకల్పి
తుండనియును గుణరహితుండనియును విష్ణ్వుండనియును విశ్వా
త్మకుండనియును విరాట్ స్వరూపుండనియును నారాయణుం
డనియును నిర్గుణుండనియును పరబ్రహ్మమనియును పరిపూర్ణుం
డనియును వేదాగమాదు లుచ్చరింపుచున్నవి ఇట్టనేక నామం
బులచే ప్రతిపాదింపుచున్న శుద్ధపరిపూర్ణంబునకు శుద్ధబ్రహ్మ
మని పేరాయెను అందు మాయాశక్తి బుట్టుటచే అతీతబ్రహ్మ
మని పేరాయెను అగ్నియందు నుష్ణమువలె ప్రకాశించుచున్న
శుద్ధబ్రహ్మమునందు (శుద్ధసత్వము శుద్ధరాజసము శుద్ధతామస
ము) లుత్పన్నమయ్యె నందు శుద్ధసత్వమునకు మాయయని
యును సర్వజ్ఞు వుపాధియనియును ఈశ్వరశరీరమనియును
పేరాయెను నాశుద్ధరాజసమునకు సృష్టికర్తయనియును నాశు
ద్ధతామసమునకు సంహారకర్తయనియును త్రిగుణములకు వేర్వే
ర పేర్లైయ్యెవ్వియున్న నీత్రిగుణసహిత సర్వాంతర్యామి విశే
షశక్తితోడ నగూడుటంబట్టి ఆకాశమును నాఆకాశమువలన
వాయువును నావాయువువలన నగ్నియును నాయగ్నివలన జల
మును నాజలమువలనపృథ్వియును నాపృథివివలన నోషధులును
నా యోషధులవలన స్త్రీపురుష జంతుజాలంబులు లోకాన్వితం

బై మహేంద్రజాలంబులై స్ఫురించుచున్నయవి నిట్టిప్రపంచ భూత సంయోగ జీవరాసుల యందు నింద్రజాలకుని భంగి నాశుద్ధబ్రహ్మము తానేయున్నింట నిండియుండుటంబట్టి పరిపూర్ణుండని పేరాయెను ఇట్లన్నిటనిండి కపటనాటకుండై య్యాడించుచు తానాడకచూచుచు తాచూడక యుండుటన్నట్టి నిరంజనుడయ్యెను అట్టి నిరంజనునిలో మాయయును మాయాప్రతిబింభములును లేనియడల నిర్వికార పరిపూర్ణనిరంజనుడై అన్నింటతానేతానై ప్రకాశించు చుండు నెట్లన సూర్యునిప్రకాశములో చీకటివేళై దోచి వెల్తూను పవీనమగునట్లు నరపశుజంతుజాలంబులు ఓషధులయందును ఓషధులు పృథ్వియందును పృథ్వి జలమందును జలమగ్నియందును నాయగ్ని వాయువందును నావాయువు ఆకాశమందును నాఆకాశముమహాకాశమందును మహాకాశము పరాకాశమునందును పరాకాశము తత్త్వాకాశమునందును తత్త్వాకాశము సూర్యాకాశమునందును సూర్యాకాశము పంచమహాకాశాతీత పరబ్రహ్మమునందును దృఢముగా లీనమై నంతట శుద్ధపరబ్రహ్మమే ప్రకాశించు చుండును కాబట్టి నీగురు కీలకమును అవిద్యోపాదికులనుజీవులకు బోధించుటకై నాశుద్ధ పరబ్రహ్మమే రామకృష్ణ నారసింహవతారము లెత్తి ఆయాయవతారములలో ప్రత్యక్షముగా తనరూపుజూపి నారాయణుండని పేరందె నా నారాయణుండు సుజ్ఞానతత్త్వ పూర్ణోదయమును ప్రసిద్ధిజేయుటకై కర్మభక్తియోగ సాధనంబులు ఆయాయవతారములయందు తమతమ శిష్యులకు బోధించియు

న్నారు కర్మయోగమనగా ఫలాపేక్షలేక సత్కర్మానుష్ఠానము చేయడము మొదటి సాధనమనియును అచంచలభక్తితో తమ రూపుల దర్శించుట రెండవసాధనమనియును యింద్రియముల నిగ్రహించి ఆత్మను యాత్మయందే లయముచేయుట మూడవ సాధనమనియును బోధించియున్నారట్టి యనుభవమందిన యోగీశ్వరులు పరబ్రహ్మమునే బొందుచుండెదరని తీర్మానించి యున్నారు ఈసుజ్ఞానతత్వ పూర్ణోదయ తొల్లి చతుర్ముఖ బ్రహ్మదేవతలకును సదాశివుడు పార్వతీదేవికిన్ని రామబ్రహ్మ మాంజనేయులవారికిన్ని శ్రీకృష్ణభగవాను లర్జునునకును యాజ్ఞవల్క్యమహాఋషి జనకమహారాజునకున్ను ఇట్లనేకమంది మహాఋషులు తమతమశిష్యుల కుపదేశమిచ్చియున్న యీసుజ్ఞానతత్వ పూర్ణోదయ భావవివేకముచే జాగ్రత్స్వప్నసుషుప్తి త్రయాతీతంబైన తుర్యంబునగాని దృశ్యంబాలోకనగాదని దృఢముగా బోధించియున్నారు (ఏకమేవా ద్వితీయంబ్రహ్మమనిన్ని) (ఓం మిత్యేకాక్షరం బ్రహ్మమనిన్ని) (ఏకాక్షర చతురక్షర పంచాక్షర షడాక్షర అష్టాక్షర ద్వాదశాక్షర పంచదశాక్షర) షోడశాక్షర మర్మముల స్పష్టముగా బోధించియున్నారు అట్టిబోధననుసరించిన శిష్యులుకడతేరి యున్నట్లనేక గ్రంథమ్ములలో వ్రాయంబడి సాదృశ్యములై కానంబడుచున్నవి.

పంచచామరం.— పురాకృతంబు నంటిమాయ పాసగ జేయు
వృత్తులన్। నిరావరాధుడై మనంబు నిల్పుభక్తియుక్తిచే। గు
రూక్తినంటిబుద్ధినొక్క। కుహరమ్ము చేర్చగా గరిష్ఠమైనప్ర

త్యగాత్మ గ్రాలుచుండు నెప్పుడున్॥

పంచచామరం.— వరించి బ్రహ్మతల్పదంబు వాలుగంటిచూ
పులో। భరించి స్వాపదార్థసార్థ భావమైక్యసిద్ధిగా। స్మరించి
ప్రత్యగాత్మనాటి స్వప్రకాశ చిత్తుడై। చరించు బ్రహ్మవిద్వరుం
డు శైత్రసూత్రై జగంబులన్॥

పంచచామరం.— సుసంగ హృదయమందిపొంద సూక్ష్మతే
జబ్రహ్మమే। ప్రసంగ మందరానికి స్వప్రశం [illegible]।
యొసంగుసూర్యచంద్రవహ్ని విస్ఫుమీకినస్ఫురా। యసంగు
వందుమాయమాయ నందిపొందిమించినన్॥

వ. ఇట్లు సద్గురుస్వాములవల్ల సుజ్ఞానతత్త్వ పూర్ణోదయ భావమును బోధింపంబడి అనుభవంబున కెవ్వారియున్న బ్రహ్మవేత్తలు పూర్వజన్మకృత కర్మంబులు మొదముట్టం దహింపు జేసుకొని పావనులై యున్నారు గాన చిలుకపంజరంబున తప్పించుకొని పారుచందంబున నీసంసార పారావారమును సుజ్ఞానతత్త్వ పూర్ణోదయమను నావచేదాటి నిస్సంగమాన ముద్రారూఢ గుణరహితమగు గుట్టుచేరి బ్రహ్మానంద సుఖమనుభవించుచుందురు ఈలోకభ్రాంతియగు భార్యాపుత్రాది సంతానములు ప్రాణాపాయ సమయంబున తోడ్పడి రాజాలరు తాను చేసుకొనియున్న సుజ్ఞానమే తోడ్పడును గనుక స్వాత్మపూజాఫల ప్రయత్నమెంత దృఢమగునో నిత్యబ్రహ్మానందసుఖ మంత సులభముగా సిద్ధించుచుండు జ్ఞానాగ్నిచే సకలదుర్గుణములు దగ్ధమైపోవుచుండును గాన బ్రహ్మానంద భరితాంతరం

గుండును యార్తజన రక్షకుండును నగు గురుస్వాములవద్ద జేరి సాంప్రదాయకముగా సుజ్ఞానతత్త్వపూర్ణోదయ భావమందం దగు (తరతిశోకమాత్మవిత్) అను న్యాయముగానన్ను (జ్ఞానంవినా మోక్షోనసంభవతి) యను న్యాయంబుల ననుసరించి పూనుటకై సాధనలు త్రివిధములున్న వందు మొదటిది (వైరాగ్యము) అనగా మనోవాక్కాయ కర్మంబులైన త్రికరణంబులతో యదార్థమాచరించి నడుచుచుండుట, రెండవది(భక్తి) వేదాంతశాస్త్రంబులయందును ఆచార్యునియందును విశ్వాసము గలిగి శుశ్రూషలుచేయుచుండుట, మూడవది (జ్ఞానము) స్వరూపాతీత సాక్షాత్కారమగు నిర్గుణమంది పరిపూర్ణుండై యుండుట, యిట్టి వైరాగ్యభక్తి జ్ఞానంబులుగూడిన భక్తుండగు జ్ఞాని మోక్షార్హుండగుచుండు నందుకై మనుజులలో నేకతరగతులు గల గుణవికారులుండెదరు. ౧, పాషాండుడు. ౨, నిహలోకకామి. ౩, పరలోకకామి. ౪, నిష్కామి. ౫, ముముక్షువు. ౬, అభ్యాసయోగి. ౭, ఆరూఢజ్ఞాని యని ౭. విధంబుల జీవులుండెదరు (మొదటిపాషాండుడు) విరుద్ధకర్మంబు లాచరించువాడు (రెండవనిహలోకకామి) పరలోకము మిథ్యయని భార్యాపుత్రాది సంపత్తులు శాశ్వతంబని నెంచుచుండువాడు (మూడవ పరలోకకామి) కర్మలాచరించి స్వర్గాదిభోగములు గోరుచుండు (నాల్గవ నిష్కామి) పెద్దలనాశ్రయించి వేదశాస్త్రముల పరిశీలించి ఆత్మదర్శనముగోరుచుండు (అయిదవముముక్షువు) నిత్యానిత్యవివేకపరిశీలుండై సాధనచతుష్టయ బ్రహ్మవిచారణ

జేయుచున్నాడు (అరవయాభ్యాసి) మాహావాక్యోపదేశంబులనంటి సకల మనిత్యమని రోసి బ్రహ్మమునందే యున్నాడు (మోదవ ఆరూఢజ్ఞాని) జీవన్ముక్తుండై శివోహం భావాంతర్గతుండై బ్రహ్మానందమును బొందుచుండును.

పంచచామరం..... దనుప్రభూరి దేహమందు దంచవూమకాం తిలో। మనోవికారముల్ గ్రహించి మహోంతతత్వదర్శిచే। నవర్తి తాంశసైన్యయూని నంద పొందుమించగా। సనాతనమ్ము మన్వితంబు స్వప్రకాశసిద్ధవ॥

వ. ఇట్టిమహేంద్రజాల మాయాకల్పిత ప్రపంచంబున యోనిసంభవుండై జన్మించియున్నను స్వస్వరూప సంధానుండై ప్రకాశించు చున్నాడను మహనీయ్యుని చతుర్ముఖ బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వరులెన్నజాలరని చెప్పియుండు ప్రమాణంబులనేకంబులున్నవి:

శ్లో॥ స్వయం ప్రకాశమానాయ పూర్ణానంద ఘనాయచ।
నిరస్తాశేషతమసే మహ్యమేవ నమోనమః॥

వ. ఇట్టిస్వయంప్రకాశుండగు బ్రహ్మజ్ఞాన పూర్ణానంద ఘనుండు పరమగురువనంబడిన సద్గురుండై (స్వయం తీర్ణః పరాంతరతి) యనురీతిగా తమదివ్యజ్ఞాన శరీరమునిచ్చి రక్షించుట వలన పరమగురువగ్యుండై విశేషజ్ఞుడనియును సర్వజ్ఞుడనియును నిర్విశేషుండనియును స్వయంభువనియును సకలదేవతలు స్తుతించుచున్నట్లు వేదశాస్త్రంబులే నిదర్శనంబులై కానబడినవి॥

శ్లో॥ నగురోరధికం నగురోరధికం నగురోరధికం। శివశాసన
తః శివశాసనతః శివశాసనతః॥

వ. యనిశివకేశవులు సహా అట్టిగురుస్వాములను పరబ్ర
హ్మ స్వరూపంబుగా భావింపుచున్నారట్లన (గురుబుద్ధివిశేషతః)
యనున్యాయంబుగా గురుస్వాములవలన సుజ్ఞానతత్త్వపూర్ణో
దయభావము గ్రహించుటకై యట్టి గురుస్వాముల శరణ్యుల
గు వారలు సర్వదోషంబులకు మూలంబగు దేహజీవులచుండెడి లో
భంబును విసర్జించి క్రమముగ సాధనంబైన కర్మకాండమును
నట్లు సద్యోగముగ సాధనమైన జ్ఞానకాండమునునట్లు సాధించి
(బ్రహ్మైవాహమస్మి) యనువాక్యానుభవము నొందుచుం దగు నట్టి
వరుసక్రమముగా బ్రహ్మానుభవమందుటయే (సుజ్ఞానతత్త్వపూర్ణో
దయము వహించుట) సగుణోపాసనయందు జీవేశ్వరులకు
భిన్నత్వమును నిర్గుణోపాసన యందు జీవేశ్వరుల నైక్యత్వము
నుసహజమైయున్నదని సనాతనమహాఋషులున్ను బ్రహ్మవేత్తలు
న్ను (ఏకమేవాద్వితీయం బ్రహ్మ)యనిన్ని (జీవోబ్రహ్మైవనా
పరః) యనినేకత్వమును కనిపెట్టి (సత్యమద్వైతం) సహజమ
ద్వైతం) బని శ్రుతుల ననుసరించివర్తించి పూజ్యులైయుండిరి
వైశ్రుతుల ప్రమాణంబులను నమ్మనివారలకు దుర్గతిప్రాపకమ
గుచుండునెట్లన సూర్యబింబమునకు ప్రతిబింబమునకును కాల
త్రయములయందును యేకత్వము సహజమగదా అట్లుఘటజలం
బున వేరైకానంబడియెడి సూర్యునిఘటమున జలము లేనప్పుడు
సూర్యుంను మాయమగు చందంబున సుజ్ఞానముతో గూడిన

జీవుండు చెక్కు చెమర్పక చిదానందనిలయ ప్రకాశమునందులీన మగుచుండుట సహజమైయుండుటంబట్టి సత్కర్మానుష్ఠానమువల్ల మత్తమజన్మప్రాప్తియును యజ్ఞాదిక్రతువులవలన స్వర్గాది భోగములును కేవలభక్తిమార్గమువలన సాలోక సామీప్యసా రూపసాయుజ్యంబులును అష్టాంగయోగసిద్ధివలన సాక్షిత్వము ను కేవల సుజ్ఞానతత్త్వపూర్ణోదయమువలన విదేహకైవల్యము ను సంప్రాప్తమగుచుండును వైకుంఠకైలాసాది మహోన్నత పదవులుకూడ (బ్రహ్మసత్యం జగన్మిథ్య) యను న్యాయంబు గా నింద్రజాల మహేంద్రజాలంబులగు పదవులేయై యున్నవి గాని శాశ్వతంబులుగావు (అనిత్య ఫలతుల్యంబులై యున్నవి) గనుక జననమరణరహితంబులైన నిర్గుణబ్రహ్మరితత్త్వ స్వయం ప్రకాశమే విదేహకైవల్యము నిర్విదేహకైవల్య మార్గంబుట యే సుజ్ఞానతత్త్వ పూర్ణోదయమందుట యిట్టిజ్ఞాన మార్గంబు టకై తొందరకిలేనిదైన స్వయంప్రకాశ పరబ్రహ్మ స్వరూపం బగు గురునాశ్రయించి పునర్జననరహితుండై జగంబులు మిథ్య యని యొండమావులచాడ్పున గ్రహించి ధృఢుడై స్వయం ప్రకాశ మందుచుండెడి శిష్యునకే బ్రహ్మవిద్యా గరిష్ఠుండవం బరగు లేక పజ్ఞానతిమిరంబుపట్టగిలి భ్రమించిన వారలకు జగ ద్బాహ్యాంతర వ్యాపక పరబ్రహ్మంబు గోచరించుట దుర్లభం బై ఘోరరుచులచే చేటొందుచుండెదరు కాబట్టి మనము చెడ బడక చమత్కారులమై కృపాంతరంగుండగు గురుస్వాముల నాశ్రయించి అనన్యాపేక్షులు తనువాదికి రాగద్వేష దూషి

తులనై మనోవాక్కాయ కర్మంబుల నొకప్పుడైనను దోషం
బుల కియ్యకొనక మృగతృష్ణికా ప్రవాహంబుగాంచి భ్రమ
పడి లేకున్నను మెలంకువతో లోకవిగ్రహంబైన పాపముగ రు
వను చెంతకు జేరంజని నిటలతట ఘటితాంజలియుక్తుండై నధ్యా
త్మ యోగసాధన త్రికరణశుద్ధిగా గ్రహించి సుజ్ఞానతత్త్వ
మార్గోదయ మందుచుండందగు నందుకై నిగ్రహలంపమి శీలం
బనబడు శీలంబువలన ధర్మంబు నెగడు ధర్మంబువలన సత్యంబుగ
లుగు సత్యంబువలన సర్వకార్యసిద్ధియొనగూడు కార్యసిద్ధివల
న చిత్తచాంచల్యంబడంగు చాంచల్యమడంగిన మోక్షం బరిచే

సిద్ధ సూక్తులు॥

క॥ సద్యోగమును వలన సుజ్ఞానమొదవు।
జ్ఞానమునయించువలన నజ్ఞానమడగు।
ఐనగ నజ్ఞానమడగిన భ్రాంతియుడగు।
భ్రాంతియుడగిన బ్రహ్మంబు పట్టుబడును॥

వ. కావుట్టి ముముక్షువైన కాంతాళి మహంచవలె నట్టికోప
ము పాపముల కాదరువైయున్నయది (పతీనాం కోప చాండాలః
కుమారాణాం తపస్వినాం) అనిమహాత్ములు వలుకుదురు ప్రమ
మెల్లకార్యములకు (పరోక్షజయతి) నాయురవసానపర్యంతము
చిదాత్మావలోకనంబునవ్వారి శివరుద్రైయ ధ్రువంబులగు దేహం
బులచే ధ్రువంబగుకీర్తినార్జించి నిఖిలహేయభాజనంబై బు
ద్బుదసమానమై క్షణభంగురంబైయున్న యీకాయము కల్పస్థాయి
గాదు (అస్థిరం జీవనం లోకే అస్థిరం యౌవనం ధనం అస్థిరం దార

పుత్రాది ధర్మస్యస్వయం(స్థిరం) గనుక జీవేశ్వరజగత్తులు సద్గు రూపదేశమువల్ల క్రమక్రమముగా నెఱింగి దృఢపరుచు కొను చుండువారలే బ్రహ్మవేత్తలు (బ్రహ్మైవాహస్మి) యనుబ్ర హ్మవంద భరితాంతరంగులరై విదేహకైవల్య నుందు నుందు రని గ్రహించుచుండందగు అట్టి యోగీశ్వరులుందు శివిమొట్లన (ఆనందనిద్రే జగదేకనిద్రే సముద్రనిద్రేవి దేహనిద్రే శ్రీయో గనిద్రే రమతే మనోమే) యను యోగనిద్రలో (సచ్చిత్తశా యిభుజగేంద్రశాయి నందాంతశాయి కమలాంకశాయి శ్రీరంగ శాయి రమతేమనోమే) యనిపరమానంద మనోల్లాసులై విదేహముక్తాది నిత్యతృప్తులై విహరించుచుందురు॥

గురుశిష్య న్యాయవివరణము.

శ్లో॥ అనంతజన్మసంప్రాప్త కర్మేంధన విదాహినే। జ్ఞానానల ప్రభావేన తస్మై శ్రీ గురవేనమః॥

శ్లో॥ జ్ఞానాశక్తి సమారూఢో తత్త్వమాలా విభూషితం। భుక్తిముక్తి ప్రదాతాచ తస్మైశ్రీ గురవేనమః॥

శ్లో॥ అఖండసచ్చిదానంద మవాఙ్మనసగోచరం। ఆత్మాన మఖిలాధారం తస్మైశ్రీ గురవేనమః॥

సీ॥ పిల్లికూనలుబెట్టి పిల్లలకుపాలెట్టి యున్నమనచోటుకు వెతకు లాడు। కావుకుదిరినవెనుక కానోటకరుచుకొని పోయినవి ల్లలను బహుపోడిమిగను। పోషించుతనవిద్య పూర్ణంబుగా చెప్పి పైకావుకాకి పైపై నిదిరుగు। తల్లితోసరియైనతావిడిచి పోవువట్లు మునోకములకుగురు మాలవిద్య। చెప్పిశిష్యుని

సరూపు చేరగాను। యపూర్వదీనసంసారి యావనిదిరుగు।వటు
ల శిష్యుని దిగనాడి యాత్మకృతిని। తిరుగుస్వేచ్ఛావిలాస
ముక్త దేశికుండు॥

గీ॥ కారణాచార్య పాదంబు గనుట మేలు।
వాక్యబోధలు విద్యసంపాదనగును।
మీద ఫలమిచ్చు నాతను మీఱియుండు।
తానె ద్వైతంబు గురువని దలపవలయు॥

ఉ॥ ఆగురు శేవ చేయుమను యాత్మనుగోరిన విద్యలన్నియున్।
వేగమెనేర్చి బ్రహ్మనెల వేర్పడగాంచుము తత్త్వసిద్ధుడై।
భోగముగోరిన గలుగుపూర్ణముగానువహింపచేయుదో।
గాగమపూజ్యదాతనని గాంచుముపుణ్యతను ప్రవీణుడై॥

వ. గురువులుతొమ్మండ్రుగురు మొదటి(బోధకగురువు)
శాస్త్రశబ్దార్థములను దెల్పుచుండు, రెండవ (వేదకగురువు)
తత్త్వములనుదర్శింపజేయుచుండు,మూడవ(నిషిద్ధగురవు)వశ్యా
కర్షణా దృష్టకర్మలచేత నిహపరములయందు మోదఖేదంబుల
నిచ్చువట్లు బోధించుచుండు, నాల్గవ (కామ్యకగురువు) పుణ్య
కర్మోపదేశములను బోధించుచుండు, అయిదవ (సూచకగురు
వు) శమదమాది సద్గుణములగు విజ్ఞానముల బోధించుచుండు,
ఆరవ (వాచకగురవు) ఆత్మానురాగము గలుగునట్లు బోధించు
చుండు, యేడవ (కారణగురువు) శివజీవేశ్వర సంధానజ్ఞానము
ను బోధించుచుండు, తొమ్మిదవ (విహితగురువు) సంశయ
ములదొలంగించి నిత్యముక్తిని ఘటింపజేయుచుండుగావ కార

ణాచార్యుండగు పరమగురుని సన్నిధికిఁ జేరంజని శరణ్యాంఘ్రి పాదములపైఁబడి శిరస్సాష్టాంగ దండప్రణామంబు లాచరించుటచే (శిష్యుండు తనమనస్సాక్షిగా ప్రాణమును ధారవోసితినని తనశిరస్సును పాదములపై బెట్టి ఆచార్యుని యాజ్ఞానుసారముగా జవదాటననియును వారివాక్యములను శిరసావహించి నడుచుచుండుననియును ప్రమాణము చేయుచుండు) శిష్యుని దయాపూర్ణుండగు గురుస్వామి శిష్యునిశిరస్సున తనకరమునుంచి (హస్తమస్తక సంయోగము చేయుచు దడవుచింతించి తలవంకించి కలశాబ్ధి సమృద్ధైశ్వర్యకరుణుండై పూర్ణానుభవసిద్ధిం గలుగ జేయుదునని యంగీకరించి [శీఘ్రమేవ జ్ఞానానంద ఫలసిద్ధిరస్తు శుద్ధచిత్తోభవ] యని ఆశీర్వదించి కుఱంగటఁ జేర లేవనెత్తిన తోడనే శిష్యుండుదోయిలించి వినయంబుకరుకొఁ తనిలువంబడి మీయాజ్ఞజవదాటిన (గురుద్రోహి నగుదుననియును పట్టినపట్టు విడముట్టం జూతుననియును) జెప్పుచుండెడి శిష్యుండు మోహాపేతుని యుం డగుచుండు నట్టన.

శ్లో॥ తాదృశం దేశికం సాక్షా ద్విశ్వేశం బుధ భాస్కరం। తోష
యేత్సర్వయత్నేన శ్రేయసే భూయసే నరః॥

వ॥ అవగా దేశికస్వాములమనంబున పూజించువానికి శుభంబును శ్రేయంబును గలుగును॥

క॥ సద్గురుకృపచే నెప్పుడు। సద్గతిదీపించుచుండు చాలా చదువు
లే। సద్గతిగలుగగ జేయునె। సద్గురువే దైవమనుచు చాటర
వేమా॥

క॥ గురువులలో దోషంబుల। నరయుట వృథసుమ్మివారి యమలో క్తులనే। శిరసావహించి వినుచును। పెరవిషయము లన్నిగూడ వీడగవలయున్॥

తే॥ మానసము వాక్కుగాయంబు మంచిస్థితికి। దెచ్చినిర్మల ముగజేయు దివ్యబోధ। మొక్కటియె జ్ఞానమనజెల్లు నొండు జ్ఞాన। మంతయునుగూడ నజ్ఞాన మనగవలయు॥

గీ॥ ఎవ్వరెవరి గుణము లేమైనమానరు। చక్కఁజెట్టవశమె కుక్కతోక। గడుసురాలుమగని గంపజెట్టమ్మదా। విశ్వదాభిరామ వినర వేమా॥

శ్లో॥ ఇదంతేన తపస్కాయ నాభక్తాయ కదాచన। నచాశుశ్రూష వేదాచ్యం నచమాం యోభ్యసూయ్యతి॥

వ. అనగా గురూక్తిగాదగిలి శుశ్రూష చేయుచు సుజ్ఞానతత్త్వ పూర్ణోదయ మందుచుండందగు॥

క॥ తనుపుపోషించుటకై। దనవంతుని గొల్చుభంగి దగమనుజుడాగిన్। మనమగు ముక్తికిగురుపద। వనజములన్ గొలువ ముక్తి నగును వసుధలో నెపుడున్॥

క॥ నరజన్మమెత్తినందుకు। గురుసేవను భక్తిమించి కొందలపడకన్। స్థిరమార్గమూనిబుద్ధిని। పరితుష్టిని బొందువాడె భక్తుండిలలోన్॥

శ్లో॥ గురుమూల ప్రపంచస్యా ద్గురుమంత్ర వినాపృథక్। గురుపూజా గురుధ్యాన గురుమంత్ర పరాయణః॥

శ్లో॥ గురుపాదోదకంపీత్వా గురుశేష గుర్వప్రియా। గురుత
ర్పణ శుశ్రూష గురుపోషణ కీర్తనః॥

శ్లో॥ గురుర్నాస్తి వర్ణానాం గురుర్నాస్తిసత్పరం। గురుహీ
న నచాఙ్గ్రాహ్యం గురుపర్వత్రసాధనా॥

శ్లో॥ గురుదక్షిణ హైశ్వర్యం గురువర్ధన మాశ్రయం। గురు
ధ్యాన మహాపుణ్యం గురుశుశ్రూష కారణం॥

శ్లో॥ గురుధ్యానయశోవృద్ధి గురుమంత్రవరంతథా। గురుతీర్థం
మహాపుణ్యాం గురుశేషం మహాత్ఫలం॥

శ్లో॥ గురుపూజవినాదైవం గురుపూజ వినాపరం। గురుపూ
జ వినాయోగం గురుపూజ వశాంత్రికం॥

—* గురుపూజవినాపర్వం నగోచరనవర్తతి. *—

శ్లో॥ గురోపరతనాస్తి సత్యసత్యంవపంశయః। గురుపాదోద
కంపీత్వా గురునామ సదాజపేత్॥

క॥ ఉదయాత్పూర్వమెనిద్దుర। వదిలియువిఙ్మాత్రములను వర్జిం
చితగా। రదనములు తోమిశుభ్రమై।కదలకగురు భక్తిస
లుప గావగుభువిలో॥

గీ॥ మేఘమడ్డమైన మిహిరుని జెరుచును। చిత్తమడ్డమైన స్థిరము
జెఱుచు। మఱుపులడ్డమైన మరిముక్తి జెఱుచురా। విశ్వ॥

క॥ నిజమాడుచుండువారలు। సుజనులై లోకమందు శోభింతు
రుగా। భజయించి గురునిగన్గొని।భుజగర్వము పొత్తుమరువ
పోలియు గుణంబుల్॥

క॥ విను వృక్షము గాచినవని । పనులకు దైవము దినొట్లు ఫల
మొసగించుఁ । జనములు గార్యమునడపగ । ననుకూలత
నిచ్చుఁగాక యయ్యెయి ఫలముల్॥

క॥ శ్రుతమువలన శ్రోత్రియుడగు । నతులతపోయుక్తిగదు మహా
త్వముబడయుఁ । ధృతిచేసహాయ యుతుడగు । నతిశయ
ముగ బుద్ధిమంతు డగుబుధసేవఁ॥

వ. బంగారమునందు కల్పితంబులైన కటకకుండ లాభరణములు వేర్వేరైనను బంగారమే ప్రధానమైన రీతిగా పరమాత్మయందు పిండాండ బ్రహ్మాండములు వేర్వేరైనను బ్రహ్మమేప్రధానమైనట్లు గురుస్వాముల బోధచే నెఱింగిన పరమాత్మ జడములైన యింద్రియముల కగోచరుండు రాగద్వేషరహితమైన సూక్ష్మబుద్ధికి గోచరుండగును జగమునందు సూర్యకాంతిలో తమతమవ్యాపారములను చేయునట్లు దేహేంద్రియ మనోబుద్ధులకు ఆత్మసాన్నిధ్యమువలన వ్యాపారములు గలిగియుండు ఘటపటాదులు దీపప్రకాశమును చూడంజాలనియట్లు మనోబుద్ధ్యాదులు ఆత్మను చూడంజాలవుగదా దీపమును చూచుటకై వేరదీప మవశ్యముండనియట్లు ఆత్మదర్శనమునకు మఱియొక ఆత్మఅవశ్యము వుండదు కాబట్టి శ్రీగురుమర్మధర్మ మెఱింగి(నిర్గుణమై శుద్ధమై బంధవిముక్తమై ఏకమై సంపూర్ణమై వెలింగెడు పరబ్రహ్మమునకు) బుద్ధిధర్మములు లేనందున నిర్గుణుండనియును యింద్రియములు లేనందున వ్యాపార శూన్యుడనియును నాశము లేనందున నిత్యుడనియును మనస్సు లేనందున నిర్వికల్పుం

డనియును ప్రపంచసమ్మంధములేనందున దోషరహితుడనియు
ను వికారస్వరూపంబైన లింగదేహము లేనందున నిర్వికారుం
డనియును భ్రాంతిచేత పరబ్రహ్మంబునందు ప్రపంచంబుదోచు
టలు గురూక్తివల్లగ్రహించి భ్రాంతితొలగించు కొనుటయే
జీవికి జీవన్ముక్తి యిట్టి ముక్తిని సాధించుటయే వేదాంతము వే
దాంతమనగా సత్యము సత్యమును నిరూపించు గ్రంధములే
వేదంబులు వేదంబులు మెరుకచేసంగ్రహించి మెరుకనుమరచి
చలించకయుండుటే అచలము అట్టిఅచలమైన పరాపరాత్మయే
పరబ్రహ్మమైన నారాయణమూర్తి నామూర్తిని తదేకధ్యానం
బున చింతించి నిర్విణ్ణుండై యుండుటయె సుజ్ఞానతత్త్వ పూ
ర్ణోదయంబను విదేహముక్తి॥

గీ॥ పగలు రేయి మాఱచి భావంబు మఱచి। తాను నేను యున్న త
లపు మఱచి। యుండువాడు నెంచ యుత్తమయోగిరా। విశ్వ॥

ఛాయాపురుష లక్షణ వివరము.

శ్లో॥ రవిర్నారాయణ స్తేజః చంద్రో నారాయణో మహః।
వహ్నిర్నారాయణ సాక్షా న్నారాయణ నమోస్తుతే॥

శ్లో॥ హృత్పద్మనిలయో జ్ఞానాం, దూరస్థ ఇవ భాతియః। ప్ర
మాణాతీత సద్భావం తంవందే జ్ఞానసాక్షిణమ్॥

శ్లో॥ నమస్తే దేవదేవేశ సర్వవ్యాపి నిరంజనః। సత్వాదిగుణ
భేదేన లోకవ్యాపారకారణః॥

సీ॥ అష్టపాద చ్ఛాయ లందు నెదురై నిలచి గళంబునందొక్క
ఘంటజూచి। ఆపై నియాకాశ మాతిరుగాచూడ ఆకార

సుంగమంబు లన్నియున్న । తనకుతాకుటుంబము తాలిమిగా
నుండు అంగంబులందునే భంగమున్న । గర్భమందున
బిలముగానగా సంతాన కుడిబాజుతో బుట్టువులకు నెడమ
బా జక్క చెల్లెండ్రుగళము తనకగునుఫాలంబు భార్యాను
పాలుగాను। ఆరుమాసాలలోపల నమరునైన। దండధరు దేశ
మందగా దారిబట్టు। చీకటైనతనతండ్రి శీఘ్రమే గు।
రుదులు చెడియున్నతల్లికి రూపమడగు॥

౫. ఇట్లుశివాగమ శాస్త్రంబున జెప్పంబడియున్న ప్రకా
రము గురుండుఛాయాదర్శనముచేయించి శిష్యునకు శుభ శుభ
లక్షణంబులు తెలుపుటకై ఆకాశమునందు మబ్బులేని సమ
యంబున నిర్జనప్రదేశము జేర్చి సూర్యుడు వెన్నంటియుండునట్లు
శిష్యునినిలిపి ఐదు అడుగులు మొదలు పదునొకండడుగుల నీడ
వరకు ఛాయచూడవచ్చునని దెలుపుచూ చేతులను ధారాళ
ముగా విడిపించిగాని వదులువకు చేర్చిగాని చేతులను పైకెత్తిం
చిగాని నిలుచుండజెట్టి యానీడను భూమిపై జూపి కంఠస్థాన
మునందు దృష్టినిచెదరనివ్వక శిరస్సుమొదలు దేహమాద్యం
తముపై చూపునిలుపుమని(ఓం హ్రీం పరబ్రహ్మణే నమః) యను
మంత్రము నుపదేశించి నూటయెనిమిదిమార్లు జపింపంజేసి ఛా
యయందు దృఢమైన దృష్టినిలిచినపిమ్మట ఆకాశము నందు
శిష్యుని కెదురుగా శిరస్సునెత్తి చూడంజేసి నీటిలో తళతళ
మను తనఛాయ కనుపడుపోల్కెగా స్ఫటికపుఛాయ నర్మిలి
చూపించి శిష్యుని రూపుకనుగొనజేయును ఆఛాయ శిష్యుండే

ప్రకారమునిలువంబడి చూడఁబడునో యారీతిగా కనుగొనచే
సును అటువలెనేచంద్రోదయమైన తర్వాతఅయిదుకొందలుపద
నొకండదుగులవరకును చూడవచ్చునని దెల్పుచూ దర్శింపంచే
సిన ఛాయాదర్శనము నారుమాసములు పైమంత్రోచ్చారణ
తో నిర్మలమనస్కులై చూచెడువారలు సాంబమూర్తిదర్శ
నమందుదు రనియును నట్లే రెండుసంవత్సరములు దర్శించిన
కాలత్రయ సుఖదుఃఖముల నెఱుంగుదురనియును నిరంతరము
ధ్యానించు సత్పురుషులకు సదాచిత్సౌఖ్యానందమంది త్రిలోక
పూజ్యులై చరించుచుందురనిబోధించి కృష్ణవర్ణఛాయచూచిన
నారుమాసములకును పాదములు కనుపడకపోయిన నారుమా
సములకును మోకాలు కనుపడకపోయిన సంవత్సరమునకును
కడుపుకనపడక పోయిన రెండుసంవత్సరములకును మృత్యువుసం
భవించునని చెప్పి పసుపుఛాయకనుపడిన రోగభయమనియును
రక్తఛాయకనుపడిన చిత్తభ్రమయనియును కుడిభుజము కనుప
డకపోయిన తోబుట్టువులకు హానియనియును యెడమభుజముకను
పడక పోయిన భార్యకుహానియనియును శిరస్సు కుడిభుజముక
నుపడకపోయిన శిష్యునకే ఆసన్నమృత్యువనియును తలకనుపడ
ని ఆరుమాసములకు పిక్కలునొకదినంబునకు సర్వాంగముకన
పడకపోయిన తక్షణమే మృతిజెందుదురనిన్ని ఛాయమలినము
గా కనుపడిన వ్యాధిదోషమనియును మెరుపుగా కనుపడిన అయి
శ్వర్యమనియును రంధ్రములుగా కనుపడిన శస్త్రఘాతముకల్గున
నియును జీవమున్నట్లు మెరుపులీగవలె పొగగప్పినట్లు కనుపడిన

క్షేమమనియును ముఖము మరియొకవైపున యున్నట్లు తోచిన రోగభయమనియును బోధించి సూర్యచంద్ర దీపపు కాంతుల లో నిల్లుచూచి గ్రహించవచ్చునని యుపదేశించుటే గాక కుడిముక్కు రంధ్రమున వాయువు ౩ దినంబులు వచ్చుచుపోవుచుండిన౧౫దినంబులకును రెండురంధ్రములగుండా మారిమారివచ్చుచుండినజయముగా నుండుననియును మారక రెంటిలోనడుచుచుండిన మూడుదినములకును నిరంతరం ప్రబలముగానడచిన నెలకును నోటిగుండానడచిన రెండుదినములకును మృత్యువు ఆసన్నంబగుననియు తెలియబోధించి రక్షించును పింగళనాడి ౧౫దినములాడిన త్వరలోమరణము రెండునెలలాడినను యిడానాడి మాసమాడినను సంవత్సరమునకు మరణము సిద్ధమనితెలిగించి ఇడానాడి పదిదినములు నడచిన మూడుమాసములకును మూడుమాసములునడచిన యాడాదికిని మరణమనియును సంవత్సరాదిని స్వరముచంద్రుడాడకుండిన హాని అష్టమీవారస్వరములేకయున్న నష్టము విదియ లేకున్న ధననాశము తదియ లేకున్న భయముచవితివారస్వరములేకున్న బంధువైరముచే బాధగలుగును పంచమివారస్వరములేకయుండిన చంచలమును రాచకలహముభవనష్టము షష్టివారస్వరములేకపోయిన సంకులము సప్తమివారస్వరములేకపోయిన దేశాటనము గల్గునని బోధించును యిదిగాక సూర్యబింబము జలమందుజూచిననిండుగాకపడిన ఆయురారోగ్యమనియును ప్రక్కలులోపమయినఆరునెల రెండునెలలకుమృత్యువనియును రంధ్రములుగా దోచిన పదిదినముల కనియును

ధూమ్రమేముగా కనుపడిన అయిదు దినముల కనియును మంట మండినట్లు-డిన నొకదినమేననియును మరణహేతువులనిబోధించి (ధృవుడనగా ముక్కుకొన గానరాక పోయినను) (అరుంధతి యనగా నాలుకకొనకానరాక పోయినను) చంద్రబింబము చాకముగాకనుపడినను చెవులఘోషము వినబడకపోయినను మృత్యులక్షణములనిబోధించును గనుక నీఛాయాపురుషసుజ్ఞానతత్త్వ పూర్ణోదయమందినవారలు దేహము విడిచెదువ్వారు దేహిదేహ మునుంచితొలగునవనిగుర్తెరింగి దేహమస్థిరమని దేహభ్రాంతితొలగించుకొని పరబ్రహ్మానంద సుఖమును బొందెదుకోర్కెచేపరమగురూక్తులనునమ్మి స్థిరచిత్తులై బ్రహ్మానందమును బొందటకునిదియే నిజమైనమార్గముగా దెలియజెప్పి నీటియందలి బుడ్డలు నీటియందే గలియుచుండునట్లను మధురమైన జలమునందునానారుచులు గల్పించినను నానారుచులను బట్టివేర్వేరురూపములైనను జలమేప్రధానమైనట్లు దేహము బుద్బుదసామ్యము దేహమున్నంతలో కైవల్యమార్జించవ దగునని బోధించును.

శ్లో॥ (పూర్వజన్మ కృతంపాపం । వ్యాధిరూపేణ బాధతే) యనున్యాయంబుగా జీవులు పుట్టిగిట్టుచుండుటకు కర్మధర్మాదిరూప పురుషార్థంబులు ఆదిమూలంబులు శ్రుతిస్మృతి పురాణాగమోక్త నిత్యనైమిత్తికాది సకల ధర్మంబులు పరమపురుషార్థంబులు మోక్షమును సిద్ధిపొందుటకై సుజ్ఞానతత్త్వ పూర్ణోదయము కారణమైయుండు నిత్యనైమిత్తికాది కర్మానుష్ఠానంబులు గురూపదేశంబున సాధనంబులైయుండు నెంత

టి సుజ్ఞానులకైనను రోగపీడలు చలన కారణంబులై ముక్తి సాధనకు విఘ్నంబులై బరగుచుండు నెక్కడజూచిన పెక్కులగు రోగులు పిక్కటిల్లుచుందురుగాని నిజమారయువారలు నూటి కొక్కండైనను చిక్కట యక్కజంబై యుండు జీవికి పూర్వజన్మమందలి జ్ఞానము పుట్టునప్పుడే యోనిస్పర్శనమువలన క్షీణమై (జ్ఞానరూపంజనసంశయః) నాశమునొందుచుండును కాబట్టి నావమారయునుదాటించుటకు కర్తగురుండే దేవుండై ప్రకాశించుచుండునట్టి గురుస్వాముల నాశ్రయించి సుజ్ఞానతత్త్వ పూర్ణోదయమంది కైవల్యమందుటయే ప్రశస్తమైన ముక్తిగా నెన్నందగు॥

క॥ పాపము జేసిన దేవుడు। గోపించును పూర్వమందు కుంభినిలో వగ। కాపితయగు రావణాసురు। డావదలగ బొందికుండె నవరేభువిలో॥

క॥ హరిభక్తిచేతగొందరు। వరిమార్తురు మొదలుముట్ట పాపంబులని। ష్టురతరపరముల నూర్యం। దరుదుగ బెనుమంచుపించ మదచినభంగి॥

వ. అనురీతిని సుజ్ఞానతత్త్వ పూర్ణోదయమును శ్రీగురుస్వాములచే గ్రహించి కైవల్యసాంబ్రాజ్యము నార్జించవలదగు॥

—* గురూపదేశ సంగ్రహము.

శ్లో॥ అజ్ఞానతిమిరంధస్య జ్ఞానాంజన శలాలయః॥ చక్షురున్మీలితంయేన తస్మై శ్రీ గురవేనమః॥

శ్లో॥ అఖండమండలాకారం వ్యాప్తయేనచరాచరం। తత్పదం దర్శనంయేన తస్మైశ్రీగురవేనమః॥

శ్లో॥ బ్రహ్మవిష్ణురుద్రశ్చ ఈశ్వరన్యవదాశివం। ఏతేగర్భగత శ్చైవ తస్మైశ్రీగురవేనమః॥

క॥ నాస్తికుడుపలుకు బ్రహ్మము। నాస్తియునా నాస్తియగున నైజము బ్రహ్మం। బాస్తికతలెచటదోచిన। వాస్తవముచ్చటనగాన వచ్చును భువిలోనా॥

క॥ టాటోటు వానిమాటలు। కోటలుదాటించుచుబురుగు కొట్టిన పైరుల్। పాటింపగింజలొసగని। మాటగతిందవరు నంద్రు మదినెంచదగునా॥

క। సరిగానిచోటుకేగుట। గురునింద రోయుసిర్పుటయును గొంకకపరులకా ధరపరిహాసించుటయుగల। పురుషులకవిదుర్గుణములు తొలియించతగునా।

క। కాకముకోకిలయగునా। యాకలములు దిన్నకుంక యార్యుం డగునా। పాకముచెడ రుచియగునా రూకలుగలలోభిధర్మరూఢుడ జెప్పుమా।

క। చిత్తరువుగతినిగదలక। చిత్తము యిరవొందవినుచు చిత్రార్థములా। మత్తిలకను చుంగురునెడ బత్తినిసలుపంగ ఫలము। బడయగవచ్చునా।

క। భయమంతాజీవునిదే। భయముడిగిన తత్వమెల్ల పరమాత్మునిదే। లయమంతా దేహముదే। జయమంతాజీవిదనుచు జాటరవేమా॥

క॥ తనువును పోషించుటకై । ధనవంతుని గొల్చుభంగి దగ మను
జుఁడొగిఁ । ఘనమగు ముక్తికి గురుపద । వనజములఁ బ్రొక్కి
వంత వర్ధిష్ణుఁ డగుఁ॥

క॥ మూషకమేష్చినబిల్లియు । దోషంబని తినక విడునె దోషుల
నటులఁ । శోషింపయముఁడు పట్టగ । ఘోషించి విడువఁబోఁడు
గొంటుల నెపుడుఁ॥

గీ॥ మంటిలోహమందు మాకులుశిలలందు । పటముగోడలందు
ప్రతిమలందు । తన్ను దెలియుకొరకు దగలదా పరమాత్మ।
విశ్వదాభిరామ వినర వేమ॥

క॥ పారక శివుమది నెంచిన । మారని కైవల్యమబ్బు మహిమ
యు బెరుగుఁ । పారును దుర్గతిదూరము । గౌరవ శివనామ మె
పుడు గురియించు శిరుల్॥

క॥ పాపము చేయుచు నెవ్వఁడు । పాపమవలుకుచును దగిలి పాప
ముమదిలో । నాపాదించుచునుండెడు । పాపాత్ములకిహపరార్ధ
ఫలములుగలవే॥

## —[*] కందార్థములు. [*]—

పరతత్త్వభావమందిన । మరుజన్మము రాదుగాన మనుజు
లకెల్లఁ । గురుచరణకమలసేవయె । దురితహరంబై వదారి ♦ దొ
రికే దెయరుదు ♦ దుర్మతులలో ♦ బరిగితేనిలదు ♦ యురమున
గురిగను । యుపము నెమ్మదినిల్పి । స్థిరబుద్ధిపమకొల్పి । సేవింపవొ
రకొను । పరమనిర్గుణభావుడై గురి । పట్టిజూపును మొయికదోలు

ను । కరణముల ఖండించినన్మది । బ్రహ్మంబనను గోష్యము ♦
దాటికేదియుసుదు ♦ దుర్మధులలో ♦ జెటిగితెనిలదు॥ ౧

తవయాత్మ భావమెుులుగని। మనుజాని బ్రతుకేటిబ్రతుకు
మదకరివిధవరా। ఘనమైన మోహమ్ముత్తిక । వసువుగలిలవిూద
నింపు ♦ టవిరెుచందమురా ♦ మూఢులకెల్ల ♦ నిడిరెుబంధ
మురా ♦ హృదయసంకల్పము । లుడుగనివారికి । మదిరల్లపై
దృష్టి ముక్కోనుచుండును । కదలనివ్వాక కంటిపాపను । గది
యనొక్కయు త్రిపుటికేగ్రక । సదయహృదయ సమూహితంబ
గు । సర్వమునుపాది నెన్నకుండిన ♦ నదిరెుచందమురా ♦ మూఢు
లకెల్ల ♦ నిడిరెుబంధమురా॥ ౨

గినశాస్త్రలమాటలు । వినసేంక వారలుతెంది వివశా
త్మకులై । మనువెంట విరుగుచుండెడి । దనుజనకిబోధచెప్ప తగ
దుమాందయ్యా ♦ టుస్పష్టక వెగటగునయ్య ♦ అగచాట్లనెం
చక వస్రతములాడుచు । నిగుణాత్రగోడను । సిగ్గువర్యంతము ।
జగతిలోనఁ పుట్టుకావుల । బాదెరుగని మూర్ఖ చిత్తుడు । తగ
దుసామ్యము సంధ్రిమించుచు । దగులుకొను ధవివశుసకునిది ♦
తగదువాయయ్య ♦ మర్మ్మద్ధి ♦ వెగటగునయ్య॥ 3

శ్రీగురువాక్యవిశేషము। చేగాకపరానుభూతి చెందరు
మనుజల్ । రోగములోగురియగుహ్వా । త్యాగమునమ్ముకో
ర్కెదీరి ♦ తమమమమయ్య ♦ నియతాత్ముడై ♦ భ్రమ
లణచుమయ్య ♦ బ్రామముడిపైద్దష్టి బూనిగుర్తించెదు । విమల
నిర్గుణమూని। విజ్ఞాతుడై యుండు। శమదమాదికగుణ కదంబము।

శక్యంబగు నిత్యసుఖమున। క్రమముగా తేలాడివలగాని। కా
శలంబగు ధ్యానపరమున। తమమణుచుమయ్య। నియమాత్మ
డై। భక్తిమలణచుమయ్య॥ ౪

శ్లో॥ (హృదయేకల్పయేద్యోగీ తస్మిన్ సర్వసుఖం లభేత్॥)

టీ. భక్తిచే హృదయపుండరీక పుష్పము మధ్య పూజ చేయుడము మూడువిధంబులందు బాహ్యభక్తి అనగా (పరోక్షభావముగా పూజించుట) ౨ అనన్యభక్తి అనగా (అపరోక్షభావముగా ధ్యానించుట) 3 ఏకాంతభక్తి అనగా (సద్రూప చిద్రూప పరబ్రహ్మమును శక్తిశాలదిరో కీభావజ్ఞానంబున నిశ్చయముగా నెంచి పూజించుట) ఇట్లు మానసంబున ఆత్మారాధన చేయుండగు॥ (శ్లో॥ శ్రవణంకీర్తనంవిష్ణోః స్మరణంపాదసేవనం। అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనం॥) అను వ్యాయాను గుణ్యంబుగా నారాధన చేయునట్టి ప్రత్యగాత్మ నిదర్శనానందములో శ్రోత్రాది జ్ఞానేంద్రియములు ౫ అధ్యాత్మికము రాగాదికర్మేంద్రియములు ౫ ఆదిభౌతిక మనసాద్యంతఃకరణములు ౪ కూడి ఆధ్యాత్మిక విషయ దుఃఖము లాత్మకంటవని పక్వేంద్రియములను తాళ్ళచే బంధంబున స్వాధీనములోనుంచుకొని యుండు స్థితప్రజ్ఞులు ధ్యానారంభములో దేహమును దేవాలయంబుగా నెంచి ఏకాంతస్థానము జేరి మనోవృత్తులడంచి బుద్ధి పరమాత్మయందు జేర్చి నవవిధ శుశ్రూషలు చేయుచుండెడి ముముక్షువులు కృతకృత్యులగుదురు కైవల్యప్రాప్తికి నదుపాయమైన యోగసాధనమిదియే సూర్యుడుదయమై చీకటివణగిం

కొందుచుండుటయే జీవన్ముక్తికి సాధనమని గ్రహించవలెను॥

క॥ గురుశిష్య భావకల్పక। గురుశిష్యాచారధర్మగుణపరిపాలా।
గురుశిష్యరూపధారీ। గురుశిష్యైకావబోధగుణగురుమూర్తీ॥

పంచమలముల వివరము.

నమోహరాయ దేవాయ మహామాయా త్రిశూలినే। తాపసా
యమహేశాయ తత్త్వజ్ఞానప్రదాయినే॥

నమః పరాయరుద్రాయ మహారాయనమోనమః। విశ్వమూ
ర్తిమహేశాయ విశ్వాధారాయ తేనమః॥

నమోభక్తభవచ్ఛేద కారణాయామలాత్మనే। కాలకాలాయ
కాలాయ కాలాతీతాయ తేనమః॥

పంచమలములనగా ఆణవము ౧ కార్మికము ౨ మాయికము ౩ మాయేయ ౪ తిరోధానములని యెఱుంగనగు॥

౧ ఆణవమలమనగా.— పరబ్రహ్మవిషయిక జ్ఞానము కలుగుచున్నప్పుడు దానిమఱుగు చేయుచుండుబుద్ధి.

౨ కార్మికమలమనగా.— గురుస్వాములు వేదాంగశాస్త్రవిషయిక జ్ఞానమునుబోధించునప్పుడుగాని వినికడయందుగాని యితరవృత్తులు గల్పించుచుండు బుద్ధి.

౩ మాయికమలమనగా.— పరబ్రహ్మవిషయిక జ్ఞానమును మదివంటనివ్వక చేయుచుండు మూఢబుద్ధి.

౪ మాయేయమలమనగా.— పాపకార్యములయందు మనస్సును పురికొల్పి అందేసంతోషింప జేయుచుండుబుద్ధి.

౫. తిరోధానమలమనగా — నిత్యానిత్య పరిపూర్ణపర బ్రహ్మమందు అనిత్యబుద్ధిని గల్పించి యాపరబ్రహ్మమునకంటె వేరుదేవతలు మంత్రతంత్రములు క్రియలు మతములున్నట్టు సాధనములున్నట్టుగల్పించి జననమరణ ప్రవాహములలో బొని పి యనుభవింపజేయుచుండుబుద్ధి.

శ్లో॥ దేహస్యాపిప్రపంచత్వా త్ప్రాగ్ద్భావస్థితిఃకుతః । అజ్ఞాన జనబోధాయ ప్రారబ్ధం వ్యక్తివై శ్రుతిః॥

వ. అనగా శరీరము పృథ్వ్యాది భూతసంయోగ వికార మునకు ప్రారబ్ధము గలుగంజాలదు ప్రారబ్ధము జ్ఞానహీనులకొర కు చెప్పబడి యున్నది సుజ్ఞానతత్త్వపూర్ణోదయము కలుగుచుం డగా నీదేహాది ప్రపంచమునకు ప్రారబ్ధకర్మలు లేవని వేదము లుచ్చరించుచున్నవి (ప్రారబ్ధము లేనేలేదని) యజ్ఞానులకుప దే శించినచో నాయజ్ఞానులు పాటువడరని ప్రారబ్ధమున్నట్లు చెప్ప బడియున్నది ఏమనుజుడు బ్రహ్మసుజ్ఞానతత్త్వ పూర్ణోదయ మంది వృద్ధిబొందుచున్నాడో యామనుజుడు ముల్లోకములలో పూజ్యుండై ప్రకాశించును.

## —[*] తాపత్రయ వివరము. [*]—

శ్లో॥ రక్షరక్షమహాదేవ రక్షమాంకరుణాలయః । భక్తచిత్త సమాసీన బ్రహ్మవిష్ణు శివాత్మక॥

శ్లో॥ జితేంద్రియాయ నిత్యాయ జితక్రోధాయతేనమః । నమః పాపాంతకాయ నమఃపాప హరాయతే॥

తుంభైయుండుట) నిట్టిచతుర్విధ శుశ్రూషలుచేయుచు గురుని పూజించుచుండు వారలే ప్రియసిష్యులగుచుందురు.

—[*] కందార్ధములు. [*]—

పరిపూర్ణమైననిర్గుణ। పరవస్తువుగానరాదు బడసెదరె టులిఁక। గురిగుర్తులేనివారికి। నిరతంబగుబట్టబయలు। నిజము గాదన్నా ♦ సద్గురుభక్తి♦ భజియింపకన్న♦ అజపమందినతత్త్వ మాక్యాంతసూన్యము। సుజనాసికవ్యక్త సూక్ష్మముమదిలోన। నిజపమాదిని ధర్శనంబున। నిర్వికార నిరంజనంబగు। విజితమూపన ధావమందక। విహరణం బొనరించువారికి ♦ నిజముగాదన్నా ♦ సద్గురుభక్తి ♦ భజియింపకున్న॥

—[*] సాధనచతుష్టయ సంపత్తివివరము. [*]—

శ్లో॥ అజ్ఞానకలుషంజీవం జ్ఞానాభ్యాసాద్వి నిర్మలమ్। కృత్వా జ్ఞానం స్వయంనశ్యే జ్జలంకతక రేణువత్॥

వ. అనగాచిరకాలము జ్ఞానాభ్యాసమువల్ల యజ్ఞానము నశించి పరిశుద్ధునిగా జేయును ఇందువగిఃజ వరుగదీసిన గంధ మును జలమువ చేర్చినతోడనే జలమునందలి బురద వేరగువట్లు జ్ఞానముచే నజ్ఞానమడంగి జీవన్ముక్తి ఘటించుచుండును.

శ్లో॥ బోధోన్యసాధనేభ్యోహి సాక్షాన్మోక్షైక సాధనమ్। పాకస్యవహ్నివత్ జ్ఞానం। వినామోక్షోనసిద్ధ్యతి॥

వ. తపో మంత్రయోగాదులు జ్ఞానమునుపుట్టించి తద్వారామోక్షము సాధించగలవుగాని జ్ఞాననమూవసాధనకాదు పుట్టినప్పటినుంచి యుండు వజ్ఞానము నాశమైనతోడనే వుట్టెమువా

నముచే స్వారాజ్యాభిషేకమునుపొంది మోక్షమంద వచ్చును
అన్నివస్తువులు పాకముచేయుటకు గలిగియున్నను నిప్పులేకపా
కముగాదుగనుక జ్ఞానములేక మోక్షముబ్బదు.

శ్లో॥ అవిరోధిత యాకర్మ నావిద్యాం వినివర్తయేత్ ।
విద్యావిద్యాంనిహంతేవ తేజస్తిమిరసంఘవత్॥

వ. అనగా అజ్ఞానము ప్రపంచమునకు మూలప్రకృతి
ప్రపంచాంతర్భూతము లైన కర్మలు జన్యజనకములు గనుక
కర్మలుచే నజ్ఞానముపడచి సుజ్ఞాన స్వయంప్రకాశమును సం
గ్రహించుటయే మోక్షమార్గము.

క॥ జీవిపోకముందే జీవవస్తువులిచ్చి। జీవినిలుపవలయు జీవన
ముగ। జీవిపోలగు వెనక జీవవస్తువులేల। విశ్వదాభిరామ
వినరవేమ॥

గీ॥ తాముగన్నవారు తముగన్నవారును। చచ్చువెల్లతమకు సా
క్షిగాదె। బ్రతుకువెల్లతమకు బ్రహ్మకల్పంబులా। విశ్వదా
భిరామ వినరవేమ॥

శ్లో॥ చక్తిసాధనయుక్తేన విచారః పురుషేనహి । కర్తవ్యో
జ్ఞానసిద్ధ్యర్థ మాత్మనశ్శుభమిచ్ఛతా॥

వ. అనగా లోకమున పరసుఖమును గోరుపురుషుండు
సాధనచతుష్టయ సంపత్సిద్ధిచే సంపాదించవలయును.

శ్లో॥ నోత్పద్యతే వినాజ్ఞానం విచారేణాన్యసాధనైః। యథా
పదార్థభానంహి ప్రకాశేన వినాక్వచిత్॥

వ. అనగాలోకమున సూర్యప్రకాశములేక పోయిన

నెదియుకొనుపడదు అట్లే సాధనచతుష్టయము లేనప్పుడు తత్త్వ జ్ఞానము పుట్టనేరదు సుజ్ఞానతత్త్వ పూర్ణోదయ భావముచే విజ్ఞానమోక్షము సిద్ధించును.

తే॥ వర్ణములు పెక్కులై యున్న వానియందు। గలిగియున్నట్టి జీవు డొక్కండుసువ్వె। బహువిధచ్ఛాయలై యున్న పశు లయందు। పాలుదానొక్కటైయున్న భంగివోలె॥

తే॥ కర్మములు జేసిపెక్కులై కానబడియు। గర్మములుచెడ నొక్కటై గానవచ్చు। గానగర్మంబులనువవి గ్రాగుట యును। నేకరూపంబుజీవాత్మ నెల్లప్రొద్దు॥

క॥ తనలోపర్వంబుండగ। తవలోపల వెదక లేకధరలో వెదకే। తనువుల మోసెను మొద్దుల। మనమున దెలుపంగ వశమె మహిలో వేమా॥

వ. జీవులకు నావరణము లేదుగలవందు—౧ దుఃఖము ౨ శరీరపరిగ్రహము ౩ కర్మ ౪ రాగద్వేషములు ౫ అభిమానము ౬ అవివేకము ౭ అజ్ఞానము=దుఃఖము, శరీరపరిగ్రహము వల్ల గలుగుచుండును శరీర పరిగ్రహము కర్మవల్ల లభించును కర్మ రాగద్వేషములవల్ల లభించుచుండును రాగద్వేషాదులు అభిమానమువల్ల వచ్చుచుండును అభిమాన మవివేకమువల్ల ప్రాప్తమగును అవివేకమజ్ఞానమువల్లవచ్చును అజ్ఞానమనాదియైనది శ్రీగురుస్వాముల కరుణచే సుజ్ఞానతత్త్వపూర్ణోదయమందిన యజ్ఞానముహరించును నాయజ్ఞాన మడంగినతోడనే యవివేకమును యవివేక మడంగినతోడనే యభిమానమును యభిమాన

మొదగినతోడనే రాగద్వేషములును రాగద్వేషము లడంగిన తోడనే కర్మయును కర్మతోడ శరీరపరిగ్రహమును శరీరపరిగ్ర హముతోడనే దుఃఖము పటాపంచలై కృశించుచుండును ఇట్టి మర్మమును గురూపదేశసాధనవల్ల సప్తావరణములు దాటినట్టి వారు నీటియందలి నివాసంబై యుండు నక్రంబునేనుగుఁ బట్టి పీనుంగుజేయుచుండు నట్టినక్రంబు బైటికివచ్చిన భయకంబుచే భంగపడు రీతిని గురునివల్ల సప్తావరణములు నశించినచో ముక్తిమార్గ మరిచేతిదైయ్యుండునని గ్రహించందగు నెట్లనిన సప్తావరణములుదాటి సాధనచతుష్టయసంపత్తిగలిగి యున్న వారలకు నిత్యానిత్య వివేకము ఇహాముత్రార్థ ఫలభోగవిరా గము శమాధిషట్కసంపత్తియు ముముక్షుత్వములను నాల్గు విధములలో మొదటిదైన నిత్యానిత్య వివేకమనగా దృశ్యప్ర పంచమంతా మిథ్యగానెంచి బ్రహ్మసత్యమని మదినెఱుంగుట రెండవదైన నిహాముత్రార్థ ఫలభోగ విరాగమనగా నీయిహ లోక సంపత్పదవులవల్ల వమనాన్నమును మలమును మూత్ర మును ఆశించకరోయునట్లు లోకవాసనలయందు నిరాశగలిగి యుండుట శమాదిషట్కసంపత్తియనగా శమము దమము ఉపరతి తితీక్ష శ్రద్ధ సమాధానములను సుగుణములారును గలి గియుండుట అందుశమమనగా నంతరింద్రియ నిగ్రహము దమ మనగా బాహ్యేంద్రియ నిగ్రహము ఉపరతియనగా సర్వక ర్మలుచేయుచు క్రమప్రకారము సన్యసించియుండుట తితీక్షయ నగా సుఖదుఃఖ ములయందు సహించి నొక్కటిరుగానుండుట

శ్రద్ధయనగా గురువుయందు వేదాంతమందు ఈశ్వరుని యం దు విశ్వాసము విడువకయుండుట సమాధియనగా మహావాక్య ములను మనస్సునన్పృధ పరచుకొనుచు పరమాత్మయందు బుద్ధి నొక్క తిద్వైకనిష్ఠతో నైక్యమందుచుండుట ఇట్టి సాధనచతు ష్టయ సంపత్సిద్ధి గలిగినవారలే మోక్షాధికార్లుగా నెఱుంగ నగు చిదాభాసుండైన జీవుని చిత్తచైతన్యమును కూటస్థుడైన పరమాత్మయందు జేర్చి మనోరాజ్యమును కోరి పరమకుండలి యగు బ్రహ్మను సహస్రారదళ పద్మకర్ణిక కుహరాంతరమం దు కుండలిచేర సాధించుటయే సాధనము॥

—[*] రాగద్వేషాదులవివరము. [*]—

శ్లో॥ రజ్జుసర్పవదాత్మానం జీవంజ్ఞాత్వాం భయంవహేత్ ।
నాహంజీవః పరాత్మేతి జ్ఞాతశ్చేన్నిర్భయోభవేత్॥

వ. అనగా జీవుడు రాగాదులలోచేరి అహంకారముచే సుఖదుఃఖముల ననుభవించు సద్గురుజ్ఞానముచే నాత్మజ్ఞానోద యమైన నిర్భయుండగు॥

శ్లో॥ అమనస్త్వాన్న మేదుఃఖ రాగద్వేషభయాదయః । అప్రా ణోహ్యమనాశ్శుభ్రి ఇత్యాది శ్రుతిశాసనాత్॥

వ. అనగా ఆత్మప్రాణము మనస్సులేని పరిశుద్ధుడని శ్రుతులప్రమాణము గనుక తనకుమనోధర్మ సుఖదుఃఖములు లేవని చింతించుచుండవలెను॥

శ్లో॥ తత్వాజ్ఞామోహార్ణవంహత్వా రాగద్వేషాదిరాక్షసాః।
యోగీశాంతి సమాయుక్తః ఆత్మారామో విరాజతే॥

వ. అనగా నిశ్శేషముగా కామక్రోధాది రాక్షసుల జయించి నిశ్చలచిత్తుఁడై తనంతటతానే సుజ్ఞానతత్త్వ పూర్ణోదయానందమును పొందంవగు॥

క॥ జ్ఞానముసద్గతిజూపును। బోనడచు సమస్తదుఃఖ మోహతమం
బుల్ । మానవులకు మోక్షప్రదమై। నాశనరహిత పదము
నందగ జేయుఁ॥

రాగద్వేషాదులు ౧౩ విధములైయున్నవి జీవులునీపదమూడును జయించవలెను ౧ రాగము ౨ ద్వేషము ౩ కామము ౪ క్రోధము ౫ లోభము ౬ మోహము ౭ మదము ౮ మాత్సర్యము ౯ ఈర్ష్య ౧౦ అసూయ ౧౧ డంభము ౧౨ దర్పము ౧౩ అహంకారము నీపదమూడు విధములలో మొదటి రాగమనగా పరస్త్రీలయందలి గమనము ద్వేషమనగా అపకారముచేయవలెననుచిత్తవృత్తి కామమనగా వింక్కిలినంపాదనయందు కోర్కెయుండడము క్రోధమనగా తనకార్య విఘ్నముచేసినవారినిశిక్షించుటకై గలిగెడు చిత్తక్లేశము లోభమనగా తనసొత్తును యితరులకు యివ్వకూడదనే చిత్తవృత్తి మదమనగా తానుయేమిచేసినను చెల్లుచున్నదను గర్వవృత్తి మాత్సర్యమనగా నితరులు హెచ్చుగానుండుటకు సహించని చిత్తవృత్తి ఈర్ష్యయనగా తనతోపాటి యితరులు కష్టపడవలెననెడు చిత్తవృత్తి డంభమనగా తానుచేయుకార్యము యితరులు మెచ్చుచుందురనే కోర్కెగలచిత్తవృత్తి దర్పమనగా నేనేసమర్థుడను నాకుసాటిలేదను

చిత్తవృత్తి అహంకారమనగా పట్టినపట్టు విడువక అదలించు చిత్తవృత్తి॥

క॥ మేలును కీడును రెండును। వాలాయము నొక్కరీతి వైరాగ్యముతో। జాలింబడకను జెందము। నేలెడువాడిక జనించ నేరడుజీవా॥

క॥ కామము క్రోధము లోభము। బాములకర వైన వైరి వర్గములర యఁగ। ధీమంతులు బరిమార్తురు కామాదుల చూరగొనుము ఘట్టిగజీవా॥

—[*] మానసపూజా సంగ్రహము. [*]—

శ్లో॥ పాహిపాహి పరబ్రహ్మ పాహిపాహి స్వయంప్రభుః।
మమయాన్త్రా రనం దేవా బృహిమే లోకనాయకః॥

పంచచామరం.— మనంబె స్థూల సూక్ష్మముల్ప్ర మాత్రుమానమేయముల్। మనంబె కామరాగరోష మత్సరాది వృత్తులు। మ్మనంబె సర్వకర్మముల్మనంబె బంధమోక్షముల్। మనంబె దృశ్యరుంతయున్। గ్రహింబుచే నెఱుంగినన్॥

తే॥ సర్వసంసార మనుమాన సముసహోదవు। సర్వసంసారమును మాన సముసరుండు। సర్వసంసారమనుమాన సముసనడంగు। సర్వసంసార మనుమాన సంబెయగును॥

క॥ తనుదాగావని మనుజని। మనముని రోధింపబడక మసలుచు దిరుగున్। దనుదాగను సత్పురుషుని। మనమానందాబ్ధియందు మగ్నతనొందున్॥

క॥ ఈమంత్ర మతవమున నే। భామామణియెవ్వ రైన బ్రాహ్మ
ణుడు బో। యీమంత్ర మెఱుగకుండిన। భూమీసురు డట్టుల
గును బుద్ధిదలంపన్॥

క॥ జ్ఞానోదయమునుగలిగిన। మానవులకు పాపవిధులు మారణ
మౌనుం। అసినకటకఫలబీజము। తో నిర్మలనీరు చేఁతోఁగును
మలినం॥

మ॥ నిరతంబుఁ భజయించు సజ్జనమనో నేత్రాభిరామంబై కన
త్స్థిరదివ్యప్రభగల్గు కౌస్తుభము చిశ్లిష్టంబు నై యొప్పునా। వర
యోగీశ్వర వంద్యమానుడగు సర్వస్వామి లక్ష్మీసుకం। ధర
మాత్మన్ గదియించి తద్గుణగణ ధ్యానంబు సేయన్ దగున్॥

క॥ హరిసేవ న్ప్రియవ్రతుఁ డరయఁగ కైవల్యపదవి నందుట
యరుదే। ధరజండాలుండైనను। హరినామ స్మరణజెందు న
వ్యయపదమున్॥

ఉ॥ మానసపూజమొదునమహా నుయతద్భుతమేమిచెప్పవన్।
ధ్యానము లేదు వ్యాసకక తంత్రము లేమియు నుండబోవుచు।
స్నానము నొల్లవాసనము చక్కనిరావులు కోరదెన్నడున్।
పానముభోజనంబులను పాకము లెంచదు బ్రహ్మమేనమా।

క॥ నీనేత్రంబులతోఁగని। మానక పూజింపు వెలిని మంత్రంబే
లా। తానే వెలుగై యుండగ। మానకుమా బ్రహ్మపదము
మాయలు లేవే॥

క॥ ఈపూజ గలుగుజ్ఞానులు। యేపూజలు లాయభోరు యేక

ము వెలుగే। ప్రాపును విశ్వబ్రహ్మము। లోపలబైలందునిం
డు లోలోకములకా॥

గీ॥ విశ్వమందునాత్మ వెలయుట నెఱుగక । వేరెయుండుననుచు
వెదుకనేల। తనదులోనయాత్మ యొనరియుంటనిజమ్ము॥ వి॥

క॥ ఈపూజచేయువారికి। నేపూటను మ్రొక్కుచుందు నిజము
గనేనే। యాపుణ్యాత్ముల రూపము। కాపాడుదు సర్వలోక
కాపైనేనే॥

జ్ఞానేంద్రియ కర్మేంద్రియ అంతరింద్రియములు పూజా
పాత్రములుగాను గంగాయమున సరస్వతులను పేరంబరిగెడు
యిడపింగళ సుషుమ్నలు అభిషేక జలంబులుగాను షట్కమల
ములు పుష్పములుగాను జఠరాగ్ని రూపముగాను చిత్కళలు
దీపముగాను బ్రహ్మానందము నైవేద్యముగాను సూర్యచంద్ర
మండలముల జ్యోతులారతులుగాను శరీరమనెడు దేవాలయ
మందు సహస్రారసింహాసనముపైన పరమాత్మస్వరూప చిద్భ్రిం
హ్మంబును భావించి పూజించియానంద మొందుచుంట ఈశ్వర
ప్రణిదాన భావనాయంత్ర మనిపేరుచే పెద్దలు వక్కాణించుదు
రట్టి మానసధ్యానము నేకాగ్ర చిత్తంబుతోడ స్మరింపు చుండిన
మోక్షమర చేతిదై ఘటిల్లుచుండు॥

క॥ మానస కమలమునందున। శ్రీనారాయణమూర్తి జింతించు
చులో। ధ్యానముసేయుటసగుణ। ధ్యానంబనియండ్రు సుజ
నులమలవివేకా॥

వ. ఈసగుణమునందు హృదయపద్మమ్మున తటస్థుంకు
ణాస్వరూప పరబ్రహ్మమును నిలిపి సమస్థ వస్థువులను గల్పించి
షోడశోపచారములచే ధ్యానించుట సగుణము అభ్యాసులకు
అతిసుఖకరమై మోక్షసాధనమై యుండును నిర్గుణ ధ్యానంబు
పరబ్రహ్మము తానను దృఢముగలుగుదాక నిర్వికల్పకబ్రహ్మని
ష్ఠసిద్ధి లభించదుగాన ప్రథమమందు సగుణ ధ్యానపరితుష్టి
పొందినవారికే నిర్గుణధ్యానసమాధి సిద్ధించునని గ్రహించందగు॥

క॥ మనసెప్పి దలచుమదియే। యదిగనుగొను నదియె బ్రహ్మ మ
నుసగ్గురినా। హృదయంబుననిలుపుట। దీనదయాపర పరమ
దారుణయోగమగు॥

సీ॥ శిలబుజూచినరులు శివుడనిమొక్కరు। శిలలుశిలలుగాని శివు
డు గాని। తనదులోనశివుని దానేల తెలియడో। విశ్వదాభి
రామ వినర వేమ॥

తే॥ సహిత దేహేంద్రియప్రాణ మానసాది। దృశ్యములుగాను
నేనని తెలియుచుండు। దృక్స్వరూపుడనుచు జింతించు
టరయ। ధ్యానయోగంబు బ్రహ్మవిధ్యానిధానా॥

గీ॥ విషయ గుణయింద్రియంబుల విద్యయందు। భ్రాంతియును
లేక జ్ఞాన భావంబునొంది। యున్నవాడు ప్రపంచంబు నున్న
వాడు। శాశ్వితంబునమాన సార్వభములవదే॥

శ్లో॥ పూజాకోటి సమంస్తోత్రం స్తోత్రంకోటి సమోజపః॥ జప
కోటి సమంధ్యానం ధ్యానకోటి సమోలయః॥

వ. బట్టిధ్యానంబున పరితృప్తి పొందందగు॥

 సుజ్ఞానతత్త్వ పూర్ణోదయం బను

—[*] పంచీకరణ వివరము. [*]—

శ్లో॥ అచింత్యా వ్యక్తరూపాయ నిర్గుణాత్మ గుణాత్మనే ।
అశేష జగదాధార మూర్తయే బ్రహ్మణేనమః॥

వ. శ్రీకైవల్య పదంబు నెవ్వని కృపచే సిద్ధించునా దేవుని లోకత్రాణ పరాయణుని నిజగురుని లోకత్రయీ కారణుని సాకారుని మది నిర్వికారుని నగుణుని స్వానంద పూర్ణాత్ముని శ్రీకల్యాణ గుణాబ్ధి రాముని మదిన్ సేవింతు శ్రీరాముని॥

శ్లో॥ అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరం। తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః॥

గీ. ఎవ్వ డజ్ఞానతిమిరంబు నెఱుగు మనుచు। నయనములయందు జ్ఞానాంజనంబునుంచి। కల్మషంబుల దొలగించి కాచితనుచు। చెప్పి రక్షించు గురువు చెంతి జేరనగును॥

గీ ఆశ చేత మనుజ లాయువు గలనాళ్లు। దిరుగుచుంద్రు భ్రమను ద్రిప్పలేక। ముదిసి బొందముందు మునుజయోగ లుభంగి। విశ్వదాభిరామ వినర వేమ॥

శ్లో॥ అనాద్యవిద్యానిర్వాచ్యా కారణోపాధి రుచ్యతే।
ఉపాధిత్రి తయాదన్య! మాత్మాన మవధారయేత్॥

వ. అనగా తెలియబడని మాయయనెడు యజ్ఞానము స్థూలసూక్ష్మ కారణ ప్రపంచములు ఈశ్వరునికి కారణ శరీరము లైనవి యీశరీరముల కతీతమైనవాడు ఆత్మయని గ్రహించు చుండవలెను.

శ్లో॥ పంచప్రాణ మనోబుద్ధి దశేంద్రియ సమన్వితం । అపం
చీకృత భూతోత్థం సూక్ష్మాంగం భోగ సాధనం॥

వ. అనగా ప్రాణవాయువు అయిదు భేదములై త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములని జ్ఞానేంద్రియములైదు వాక్పాణిపాద యూపస్థలని కర్మేంద్రియములైదు సంకల్ప వికల్పములైన యంతఃకరణములోగూడిన మనస్సు నిశ్చయరూపమైన బుద్ధి ఈపదిహేను అవయవములు కలిగిన సూక్ష్మశరీర మేలింగ శరీరము యిదిఆత్మకుభోగ సాధనమైయుండును.

శ్లో॥ ఉపాదానమఖిలాధారే జగంతిపరమేశ్వరే । సర్గస్థితిల
యంయాంతి బుద్బుదా ఇవవారిణి॥

వ. నీటియందు బుగ్గలుపుట్టినశించి నీరగు చున్నట్లు పరమాత్మ యందనేక బ్రహ్మాండము లుత్పత్తిస్థితిలయానగుచు వేరుగాకనుపడినప్పటికిని నశించి పరమాత్మ యందే లీనమగుచుండును.

శ్లో॥ వాయుఃప్రాణ స్తథాకాశ స్త్రివిధో జీవ సంజ్ఞకః॥
ప్రాణాపాన వశో దేహో । హ్యధశ్చోర్ధ్వం ప్రధావతి॥
ప్రాణంయావత్థ్సితో దేహే । అపానంతు నిరోధయేత్।
యావద్దృష్టి ర్భ్రువోర్మధ్యే। తావత్కాలంభయంకుతః॥

వ. నిరవధిక శూన్యమైనది ఆకాశము అందు గాఢాంధకారమైనది మహదాకాశము అందు ప్రళయానలమైనది పరాకాశము అందు అతిద్యుతి ప్రచయమైనది తత్వాకాశము అందురవికోటి కంకాశమైనది సూర్యాకాశము యీపంచాకాశ

ముల శరీరమై ఏకాకారమై వాచామ గోచరమైన జ్ఞప్తియే పరమాత్మ స్వరూపము అద్వయ బ్రహ్మముప్రకృతి చేరుటవలన అండపిండ బ్రహ్మాండము లుత్పన్నమై తనంతటనవియే లీనమగుచున్నవి — పరమాత్మయైన బ్రహ్మంబునందు మాయాకల్పితముగా కాలముద్రోచి బిందావాకృతి జనియించి నందున్న అర్ధచంద్రాకృతిదోచె దానివలన కుండలాకృతిదోచె దానివలన దండాకృతిదోచె వట్టి బిందువునకు బీజము (య) అర్ధచంద్రాకృతికి బీజము (వ) కుండలాకృతికి బీజము (శి) దండాకృతికి బీజము (మ) తారకాకృతికి బీజము(న)ఇట్లు (నమశివాయ) యను పంచాక్షరములలో (యకారము) ఈశానముఖ బ్రహ్మయును (వకారము) తత్పురుషమగు బ్రహ్మ (శికారము) అఘోరముఖ బ్రహ్మ (మకారము) వామదేవముఖబ్రహ్మ (నకారము) సద్యోజాత బ్రహ్మమని పైయైదు బ్రహ్మలుబుట్టిరి ఆపరమాత్మయగు విరాట్పురుషుడు హిరణ్యగర్భునికి అండాకృతిగా అవ్యక్త బీజము దోచినందున నిరువైయైదు తత్త్వశరీరములుబుట్టెను ౧ ఆకాశము ౨ వాయువు ౩ అగ్ని ౪ జలం ౫ పృథ్వి నాపృథ్వియందోషధులును నరమృగ పక్ష్యాది సర్వప్రపంచము బుట్టెను ఆమహా పంచభూతములు పృథ్వీజలము అగ్నివాయువు ఆకాశములకు స్థానములు పృథ్వికి బీజం (లం) గుదస్థానము జలమునకు బీజం (వం) లింగస్థానముఅగ్నికి బీజం (రం) నాభిస్థానము వాయువునకు బీజం (యం) హృదయస్థానము ఆకాశమునకు బీజము (హం) కంఠస్థానము యీస్థానములకు పంచ

కర్తలు బ్రహ్మవిష్ణురుద్ర ఈశ్వర సదాశివులైరి పంచశక్తులు క్రియాశక్తి-జ్ఞానశక్తి-ఇచ్ఛాశక్తి-పరాశక్తి-సహజశక్తులుబుట్టెను-పంచీకరణ తత్వములు ౨౫ గి శరీరములు-జ్ఞాతి - ప్రాణము-శ్రోత్రము- శబ్దము-వాక్కు- ౫ న్నూ ఆకాశ సమ్మంధములు మనస్సు- వ్యానము-త్వక్కు- స్పర్శము - పాణి-౫ న్నూ వాయు సమ్మంధములు బుద్ధి ఉదానము చక్షువు రూపము పాదము ౫ న్నూ అగ్నిసమ్మంధములు చిత్తం సమానము జింహ్వ రసము గుహ్యము ౫ న్నూ జలసమ్మంధములు అహంకారము అపానము ఘ్రాణము గంధము ఉపస్థ ౫ న్నూ పృథ్వీ సమ్మంధములు ఈల్లు ౨౫ తత్త్వములు.

శ్లో॥ ఉపాదానం ప్రపంచస్య బ్రహ్మణోన్య న్నవిద్యతే।
తస్మాత్సర్వః ప్రపంచోయం బ్రహ్మైనాస్తిన చేతరమ్॥

వ. అనగాపృథ్వాది పంచభూతముల చేత గలిగిన ప్రపంచ మంతయు బ్రహ్మస్వరూపమే యనుచున్నవి॥

శ్లో॥ బ్రహ్మణ సర్వభూతాని జాయంతే పరమాత్మనః। తస్మాదేతాని బ్రహ్మైవ భవంతీ త్యవధారయేత్॥

వ. అనగా పరమాత్మవల్ల సర్వభూతములు పుట్టుచున్నవి సకలభూతములు బ్రహ్మస్వరూపమే వేరుగావు.

శ్లో॥ యద్వైవ్యోమ్ని సీలత్వం యథానరమరస్థలే। పురుషత్వం యథాస్థానా తద్వద్విశ్వం చిదాత్మని॥

వ. అనగా ఆకాశమునల్లదని భ్రాంతి గలిగినట్లున్నూ జలములేనిచోట ఎండమావులు జలంబుగా దోచినట్లున్నూ స్థాణువు పురుషుడుగా దోచినట్లున్నూ పరమాత్మయందు ప్రపంచ భ్రాంతి దోచుచున్నది.

పంచభూతోద్భవంబైన పంచవింశతి తత్త్వములు.

| | ఆకాశం | వాయువు | అగ్ని | జలం | పృథ్వి |
|---|---|---|---|---|---|
| పృథ్వి | వాక్కు | పాణి | పాదం | పాయువు | ఉపస్థ లింగము |
| జలం | శబ్దము | స్పర్శము | రూపము | రసము | గంధము |
| అగ్ని | శ్రోత్రము | త్వక్కు | చక్షువు | జిహ్వ | ఘ్రాణము |
| వాయువు | ప్రాణము | వ్యానము | ఉదానము | సమానము | అపానము |
| ఆకాశం | జ్ఞాన | మనస్సు | బుద్ధి | చిత్తం | అహంకారం |

ఇట్లు స్థూలాంగమైన (శరీరమునకు) బంధకర్మాదులు కామక్రోధ మదమాత్సర్య అరిషడ్వర్గ క్షుత్తు పిపాస నిద్ర శోక జననమరణ షడూర్ములు జాతివర్ణ ఆశ్రమ భావ గోత్ర నామములు మొదలగునవి భ్రమల చేతకూడి పిండాండమై పుట్టుట పెరుగుట బాగుపడుట ముసలివాడగుట మృతిజెందుట అను షడ్వికారములలో కట్టుబడిన స్థూలాంగమునకు ప్రణవములో నిశ్వాససంయుక్తమై జీవాత్మ పరమాత్మ అంతరాత్మ చిదాత్మ కములాత్మ లుండునట్లు తార లక్షలకుట స్వరూపంబులై యుత్పవించుటకు పంచవిధ యోనులుగల బ్రహ్మనాడి యుత్పవించి సమష్టమునకు కారణమై పంచభూతములలోని సార

ము ననుభవించుటచే ధాతుయుక్తంబై స్త్రీపురుష సంయోగ
మునబుట్టిన శుక్లశోణితములుకూడి నవమాసములునిండి నేలం
బడునప్పుడు యోనిస్పర్శ తగులుటచే జీవిపూర్వజన్మ పరంపర
లుమరచుట మాయకులోనై పుట్టుట గిట్టుటలకు పాల్పడియుం
డుట పంచభూత సంయోగమై యున్నది తల్లి గర్భము లో
పెరుగుచున్న నవమాసంబున జీవుండు సంపూర్ణుండై చేరి హృ
దయకర్ణికా కుహరాంతర మధ్యమునందలి చిదాకాశంబున
ఓంశబ్ద స్ఫటికసంకాశాయసూర్య సోమాయ నిరంజనాయ నిత్య
సత్యాయ ఓంయని జ్యోతిరాకృతిలో ప్రణవసంకాశమైన (నమ
శ్శివాయ) యను పంచాక్షరములే పంచముఖంబులై సద్యోజా
తము ౨ వామదేవము ౧౩ అఘోరము ౧౪ తత్పురుషము౧౫
ఈశానము లుద్భవమైయ్యె ౧సద్యోజాతమునకు ఆధారకమలము
౨ వామదేవమునకు స్వాధిష్ఠాన కమలము ౩ అఘోరమునకు
మణిపూరకము ౪ తత్పురుషమునకు అనాహతము ౫ ఈశాన
మునకు విశుద్ధములు తుల్యమైయ్యె నీయైదింటికి గోప్యమైన
యాజ్ఞేయ కమలమునందు ఆత్మ చేరి తిరుగుచుండుట సద్గురూప
దేశముచే కాష్ఠంబునందగ్ని బుట్టుచు కాష్ఠంబును దహించునట్లు
పాపమును భస్మముచేయుటకు సుజ్ఞానతత్త్వ పూర్ణోదయంబం
దిన ముక్తిగా బడయవచ్చు నీప్రపంచ పంచీకృత మహాభూతం
బులును పంచవిషయంబులును దశేంద్రియములును మనోబుద్ధి
చిత్త అహంకారంబులును వీటికన్నింటికి కారణమైన విక్షేపశ
క్తియునుంగూడి యిరువదినాల్గు తత్త్వంబులై దేహరూపం
బున పరిణమించుటవలన క్షేత్రమనియును క్షరమనియును ప్రకృ
తియనియును అనాత్మయనియును జెప్పంబడును అందుమూల
ప్రకృతి (శుద్ధసత్వమును) మాయయనియును (మలినసత్వము

ను) అవిద్యయని రెండువిధములు యిట్టిశుద్ధసత్వమైన మాయ
యును అమాయకు అధిష్టాన బ్రహ్మచైతన్యమును మాయాప్రతిబిం
బమును గూడిన (ఈశ్వరుడు) అందు అవిద్య బ్రహ్మ చైతన్య
మున ప్రతిబింబముతో గూడి జీవుండు పంచవింశతుండని క్షేత్ర
జ్ఞుడని అక్షరుండని పురుషుండని ఆత్మయని జెప్పంబడు నిట్టి
ఆత్మను సాంఖ్యతారకయోగ సాధనంబులతో సాక్షాత్కరించు
కొనుటయే అపరోక్షానుభవము యిట్టిఅనుభవ మందుటయే
యమనస్కమునై యాకాశపంచకములు వాయుపంచకములు
జలపంచకములు పృథ్వీపంచకముల అనియిరువైయైదుతత్త్వ
ములాయెను యీపంచీకరణమును గ్రహించి యందుప్రకాశిం
చు నాత్మయే సర్వసాక్షిగా భావించి యభావులై యుండుటయే
యమనస్కపూర్ణ భావము ఆకాశంబున విద్యుల్లేఖబుట్టి ఆకాశం
బుననే లీనమగుచుండునట్లు పృథ్వియందుబుట్టిన యోషధ శాకీ
నములవన్నైరా పృథ్వియందే లీనమగుచున్నవి (యధాజలము
యందుమనః)జలమందుబుట్టిన పృథ్వీజలమందే లయమగును అట్లు
జలమందు బుట్టినమనస్సు జలమందే లయమగును తేజమందు
బుట్టినజలము తేజమందు లయమగునట్లు తేజమందుబుట్టిన
అహంకారము తేజమునందే లయమగును వాయువునందు బుట్టి
నయగ్ని వాయువునందు లయమగునట్లు వాయువునందుబుట్టిన
ప్రాణము వాయువునందే లయమగును ఆకాశమునందుబుట్టిన
వాయువు ఆకాశమందు లయమగునట్లే ఆకాశమునందుబుట్టిన
శబ్దము ఆకాశమునందు లయమగును అట్టిశబ్దమే నాదము
నాదబిందుకళలు శబ్దమునందు లయమగుచుండగా నిశ్శబ్దమైన
వస్తువులే పరబ్రహ్మమని సాధనలో మిన్నయై హృదయము
నిశ్శబ్దముగా జేసి పట్టుటయే జీవన్ముక్తియనంబడు నిట్టిజీవన్ము

క్తినివగలి యాగములు కర్మలు ఫలాపేక్షచేజేసి అంత్యకాలం బున నిడానాడిమార్గముగా ప్రాణమువిడచువారలు ఫలాపేక్షల ననుసరించి స్వర్గనరకముల ననుభవించి పునర్జన్మము నెత్తుచుందురట్టివారు కృష్ణపక్షమి రాత్రిమొదలుగ అమావాస్య౧గి దినములలో పోయితిరుగా జన్మించుచుందురని వేదాగమాదుల ప్రమాణములున్నవి.

| ఆత్మ | స్థూలపంచీకరణము. | | | |
|---|---|---|---|---|
| ౧ ఆకాశం / అంతఃకరణము | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము |
| సమానవాయువు | ౨ వాయువు / వ్యానవాయువు | ఉదానవాయువు | ప్రాణవాయువు | అపానవాయువు |
| శ్రోత్రేంద్రియము | త్వగింద్రియము | 3 అగ్ని / చక్షురింద్రియము | రసనేంద్రియము | ఘ్రాణేంద్రియము |
| శబ్దము | స్పర్శము | రూపము | ౪ జలము / రసము | గంధము |
| వాగింద్రియము | ప్రాణేంద్రియము | పాదేంద్రియము | ఉపస్థేంద్రియము | ౫ పృథ్వి / పాయువేంద్రియము |

యీస్థూల పంచీకరణమును శ్రీగురుస్వాములద్వారా గ్రహించి సూక్ష్మపంచీకరణమునున్నా క్రమంబుగా నెఱుంగ వలెను॥

## సూక్ష్మశరీర పంచీకరణము.

| పంచీకృత పంచసూక్ష్మభూతము | | ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి | పరిణామసూక్ష్మభూతములు |
|---|---|---|---|---|---|---|---|
| సత్త్వగుణ సంబంధ భూతములు | సమష్టిసత్త్వగుణ సంబంధ భూతములు | ○ | మనస్సు చంద్రుడు | బుద్ధి బృహస్పతి | చిత్తము క్షేత్రము | అహంకారము రుద్రుడు | అంతఃకరణములు అధిదేవతలు |
| | వ్యష్టిసత్త్వగుణ సంబంధ భూతములు | శ్రోత్రము దిక్కులు | త్వక్కు వాయువు | చక్షువు అర్కుడు | జిహ్వా వరుణుడు | ఘ్రాణము అశ్వినులు | జ్ఞానేంద్రియములు అధిదేవతలు |
| రజోగుణ సంబంధ భూతములు | సమష్టి రజోగుణ సంబంధ భూతములు | సమానము జయుడు | వ్యానము విశ్వయోని | ఉదానము అజుడు | ప్రాణము విశిష్టుడు | అపానము విశ్వకర్మ | పంచప్రాణములు అధిదేవతలు |
| | వ్యష్టి రజోగుణ సంబంధ భూతములు | వాక్కు వహ్ని | పాణి ఇంద్రుడు | పాదము విష్ణు | గుహ్యము బ్రహ్మ | పాయువు మృత్యువు | కర్మేంద్రియము అధిదేవతలు |

ఈపంచీకరణ భాగములు స్పష్టముగా గురుముఖంబున నేర్చికొనిన వారలకు నీపంచభూత ప్రకారములు మనస్సునకు స్పష్టముగా తెలియుచుండును॥

సగుణనిర్గుణ ధ్యాన వివరము.

క॥ మానసకములముసందున। శ్రీనారాయణమూర్తి జింతించు చుండు। ధ్యానము సేయుట సగుణ।ధ్యానంబని యంత్రమనుఃను లవా వివేకా॥

వ. హృదయకమల పద్మమునందు విరాట్పురుషుని భావించినిలిపి మనస్సుచేత సమస్త వస్తువాహనములు గల్పించుకొని షోడశోపచారములను చేస్తూ ధ్యానించుటయే సగుణధ్యానంబనంబడు సగుణోపాసనయందు జీవేశ్వరులకు భిన్నత్వమును నిర్గుణోపాసనయందు ఏకత్వమునుసిద్ధించును॥

క॥ ఉపశంహృత్యబ్రాహ్మద్దృక్కున। త్రిపుటికిమధ్యంబునందు దీపము తానై। జపియించు రామమంత్రము తపసిని గనుగొన్నవాడు ధన్యుడుతరుణీ॥

మ॥ ఘనతం దారక సాంఖ్య యోగములచే। గష్టించగానేల యింద్రియముల మర్ధింపగానేల చక్కనగాముందట గానుపించుచుటము।గన్నట్లు బ్రహ్మంబుగా। దను దాగాంచినయంతలోనిఖిలము దానై వెలుంగందగు॥

శ్లో॥ స్వప్నేజాగరితంనాస్తి స్వప్నోజాగరితేనహి। ద్వయమేవాలయేనాస్తి లయోపిహ్యు భయోర్నహి॥

వ. స్వప్నములోజాగ్రతజాగ్రతలో స్వప్నము లేదుయీ

నొంటిలో లయము లేదులయములోని రెండు లేవనిన్నెరుంగనగు॥

క॥ మనసేమాయామృగమీ। మనసేముక్తికిసగాని మత్తిబోనీ
కగా। మనసగు గర్వపు మృగమును మనసునను జంపిన
ముక్తి మహిలో వేమా॥

శ్లో॥ బ్రహ్మైవ సర్వనామాని। రూపాణి వివిదానిచ।కర్మాణి
చసమగ్రాణి భర్తీతి శ్రుతిర్జగా॥

వ. అనగా పరబ్రహ్మమే సర్వనామంబులు నానారూ
పంబులు సంపూర్ణకర్మలను ధరించుచున్నాడని వేదములు బలు
కుచున్నవి.

—[*] కందార్థము. [*]—

ఎన్నాళ్లుండినకాటికె। తిన్నలవలెధనములున్న దినకూ
టికనుగా। పున్నంతకాలమీశ్వర సన్నుతిమదినెంచుమించు॥ వ
రణిగర్గానరాసికర్గళ పరమునీశగురా॥ మరణపునర్భవ మాయ
లకంటని। తిరమైనయా బ్రహ్మతేజమంటియుండు॥ నిరుపమం
బగు నిర్గుణంబది। నిరీక్షణుడవై యెన్నుచుండుము॥ పరాపర
మగు బట్టబయలే బ్రహ్మతన్మయ జీవభావము। సరణిగర్గా
వరా॥ నిరర్గళ పరమునీశగురా॥

క॥ కలియుగమున మానవులకు। సులభముగా ముక్తినొసగు
సూత్రంబిలలో। పలభక్తియోగమెయని। తెలియంగావల
యుదేటతెల్లముగాగ॥

ఉ॥ కాలుడు సర్వభోగ విభవంబులనిక్కక యొందుబొమ్మనా।
వేళను జేరదాబ్చియది యెన్నిధిగాదలపోసిరృప్తునా। పోలిక

భక్తవర్యుడిహ భోగములన్ని జయించిసర్వదా।
తెలుచునుండు మోదవనధి న్పరమేశ్వర దర్శనంబునన్॥

తే, గీ. మంచిచేపలుదొరికెడు మనికివెదక॥
వానిబట్టెడుధీవరు వలెనుభక్తి।
దరసిసద్గురునెడ బరమాత్మగట్టి।
దివ్యసుఖకర ముక్తిసాధింపవలయు॥

ఆ, వె. ఓడజలమునందు నుండవచ్చునుగాని।
యుండగూడదుదక మోడయందు।
నరుడులోకమందు దిరుగువచ్చు బ్రపంచ।
మతనిలోనినుండు హానివచ్చు॥

తే, గీ. మంత్రముపదేశమునుజేయు మనుజమాత్రు।
డైనసామాన్య గురుడట్లు గానియుత్త।
మగురుడీశ్వరరూపంబు మదినినాటి।
చిటికలోమోక్ష మొసగును శిష్యునకును॥

క॥ అదరక నీమదిలోపల। చెదరకగురినిలిపిగురువుచే బోధితు
డై । పదరక భావజ్ఞుడవై । కదలక గనుచుండు మెపుడు
భువమతిజీవా॥

క॥ మాయావాదులు పలువిధ। మాయలు గల్పించి యుపము
మాయింతురయా। మాయకు వెలియైచిత్తము। కాయని
గురుజ్ఞానవిష్ట బడయుముజీవా॥

వ. ఇట్టి సుఖమునే మోక్షమును పొడబాయక ధ్యా
నరూపంబున గ్రహించు చుండందగు నట్లు చేయని చో దుఃఖము

నెడి మరణహేతువు సంప్రాప్తమగుటయే ఆత్మనావరణశక్తి చే దుఃఖముసంభవమై మొదటి జన్మకారణమైన దుఃఖము సంభవించుచుండును యాజన్మకారణ దుఃఖమునకు కర్మయభిమానకారణము యభిమానమునకు అజ్ఞానముకారణము ఆయజ్ఞానము మాయవలన కారణమైవచ్చుచుండును మాయనుజయించిన బ్రహ్మజ్ఞుడే మోక్షార్హుడగుచుండును.

శ్లో॥ మనయేవమనుష్యాణాం కారణం బంధమోక్షయోః ।
బంధాయవిషయాశక్తం ముక్తానిర్విషయంమతం॥

మనస్సు విషయ సంగములేక నిర్విషయమై యుండుటే ముక్తి మనస్సు బ్రహ్మమునందుకలియక నిర్విషయముకానేరదు లవణముజలంబునప్రవేశమై కలియునట్లుజీవుండు బ్రహ్మసాక్షాత్కారమువందు బ్రహ్మమగుచుండును॥

శ్లో॥ సత్యచిద్ఘన మఖండమద్వయం । సర్వదృశ్యరహితంనిరామయం॥

అనగా కాలత్రయబాధ్యము దట్టమైన జ్ఞానస్వరూపము పరిపూర్ణము అద్వితీయమైనది సకల దృశ్యవిరహితమైన మాయారూపు రాగములేనిది (శ్రు) యత్పరవి మలమద్వయం శివం॥ తత్సాహమితి మౌనమాశ్రయ॥ అనగా అద్వితీయపరబ్రహ్మమును శాశ్వితంబుగా నైక్యముజెందుటయే మదిలో నమియుడోచని మౌనముద్రచే పరిపూర్తిజెందియుండుట సుజ్ఞానతత్త్వ పూర్ణోదయభావమంది విదేహముక్తి నొందుటయని తెలియుచుండం దగు॥

## సమాధిలక్షణ వివరము.

శ్లో॥ బ్రహ్మవిష్ణు శివసాక్షా ద్గోవిందో గతిదాయకః।
పీతాంబరో ధరో దేవో మాధవశ్శివసేవితః॥

సమాధి సవికల్పమని నిర్వికల్పమని ద్వివిధములైయుండు సవికల్పము దృశ్యానువిద్ధసవికల్పమని శబ్దానువిద్ధసవికల్పమని రెండు తెఱంగులును నిర్వికల్పమున్నూ గూడి త్రివిధంబులయ్యె నీమూడున్నూ యన్వయముగాతోచెడు దేవతలు మొదలుగాగల బ్రహ్మాండము లోనుగాగల చేతనాచేతనములు తెలివియందేబుట్టి గిట్టుచుండునట్టిప్రజ్ఞచే బ్రహ్మము నెఱింగి వేఱుగాతోచుచున్న పరబ్రహ్మమును దర్శించుట సవికల్పకము తానేయాపరబ్రహ్మముగా భావించుటచే వృత్తులడంగియుండుటే నిర్వికల్పకసమాధి అందుసచ్చిదానంద పరబహ్మ స్వరూపమైయుండుటే అంతరనిర్వికల్పక సమాధిగానెన్నందగు.

క॥ ధ్యానసమాధ్యాదికవిధి। తానుష్ఠానములమెడపి తంపుబనులుదా। బూనిసలుపంగనోపని। మానవులకుసేల ముక్తిమార్గముగలుగు॥

క॥ తమనిజము దామెఱుంగక। తమమునబడి సర్వజీవదయయుడిగిమదిగ। శమదమగుణములునిలుపని। కుమతులకును రౌరవంబు గురుగతిగాదే॥

తే॥ కొందరాత్మతత్వ మెఱుంగుదుమటంచు।
గర్వులైనిక్కిచిత్త నిగ్రహములేమి।

ఉ॥ సుజ్ఞానత త్త్వ పూర్ణోదయం బను
నుపరతిసుఖంబుగానక విపులవిషయ।
రాగలోలత జెడుచుదూరక మహాత్మా॥
క॥ సర్వావస్థలయందును। సర్వంబును బ్రహ్మమనుచు సతతము
గనిర్ద। సర్వవికృతి రహితసహజ। నిర్వాణసమాధియగు
వినిర్మలచరితా॥
తే॥ జ్ఞానవిజ్ఞాన యుతుడై యొ్య్య సంతతంబు।
నాత్మభావన లేకున్న యతనియింద్రి।
యంబులు మనంబుతమకు వశంబు చేసి।
విషయ సుఖముల చవిజూపి వెతల బెట్టు॥
ప్రత్యగాత్మనైన నేనే పరమాత్మను యాపరమాత్మయే
ప్రత్యగాత్మయని నిష్టచేయుచుంటయేసమాధి॥

—[*] కందార్థము. [*]—

మనసేము క్తికిభు క్తికి। మనసేహేరాళమైన మాయలు
జూపున్। మనసేమూలముసర్వము। మనసేమనసైతె వేరే మా
యలేదన్నా • గుణములడంచి • పోయెగదన్నా • ఖాయని
భ క్తిని। ప్రసరింపకేమక ధీయుతంబువజాడు। ధీపించుబ్రి
హ్మము వేయుక్రతువులు జేయుటలను। విజితమానసదృ
ష్టిబాంద్రిక। చాయలీలలు తుప్పటిల్లెడు జవముగల పరబ
యలుదాకిన • మాయలేదన్నా • గుణములడంచి • పోయె
గదన్నా॥
శ్లో॥ ప్రభాశూన్యం మనశ్శూన్యంబుద్ధిశూన్యం నిరామయం।
సర్వశూన్యం నిరాభాసం సమాధి స్థస్యలక్షణం॥

సమాధియందు ః జ్ఞానతల్పే పూర్ణోదయమనస్కుడై యుండందగు॥

## పంచముద్రల వివరము.

శ్లో॥ అఖండ మండలాకారం సర్వశూన్యనిరావయం । నిర్మలం నిష్కళంసాక్షా ద్గురుపాదముపాంభ కే॥

క॥ ఈ రాజయోగమార్గం । బీ రేడుజగంబులందు నెవ్వరెఱుగరా । త్మారాములసదపాంగా। పారక్రపాయుక్తులైన భక్తులు దక్కన్॥

క॥ యోగాభ్యాసను వలనన । దాగతించి తేంద్రియముల దర్పములడగున్। రాగ ద్వేషాదులంచను। బాగుగనాత్మకసుఖానుభవముంగలుగున్॥

౧ ఖేచరియనగా కన్నులుమూసియైనను మూయకనైనను జూపుకనుబొమలమధ్య నిలిపిచిదాకాశముజూచుచుండుట ౨భూచరియనగా కన్నులుగదలింపక తనముక్కుకొననుజూచుచుండుట ౩మధ్యమియనగా కన్నులుసగముమూసి ముక్కుమధ్యమున చూపునిలుపుచు నుదురుచూచుట ౪ షణ్ముఖయనగా చెవులుకన్నులు ముక్కులగునారింటిని మూసి అంతర్ముఖమున కనుబొమలనడుమ దృష్టినిలిపి నాదబిందుకళలజూచు చుండుట ౫శాంభవియనగా ప్రాణాదివాయువులు మనస్సుమొదలయినవి పదునాల్గుయింద్రియములను జయించి కన్నులతెఱచి నైయర్థచూపుచే చిదాకాశమునుజూచుచు నక్కడివింతలను చక్కగాగ్రహించుచు సాక్షియుండుట బ్రహ్మజ్ఞాని జ్ఞానేంద్రి

యు కర్మేంద్రియములకు రాజైన మనస్సును వశపరచుకొని యితరచింతలుమాని ఓర్పునేర్పులతో నాదబిందుకళల నుద్ధరించుచుండెనేని కళాతీతమయిన పరబ్రహ్మమునందు సాక్షీభూతుడు విజ్ఞానము ప్రబలి తానేనిరతిశయానందమును బొందుచుండును॥

క॥ మానజపమునిశ్వృత్తి। ధ్యానము గావించియక్రియా త్మార్చనముం। బూనియొనరించి చిదఖం। డానందంబను భవింపుమయ్యా మహాత్మా॥

తే॥ అఖండ సుఖామృతా వ్యాప్తిజెంది।
చిత్తవిశ్రాంతి తాంబూల సిద్ధిగాంచి।
మురిసియానమాన మూర్తివై ముక్తికాంత।
తోవినోదింపు మయ్యావా తూలతినయా॥

శ్లో॥ ఓంత్రిగుణాతీతరూపాయ త్రిగుణాత్మకవాసినే। సమస్తజగధాధారా మూర్తయే గురవేనమః॥

ప్రణవధ్యాన వివరము.

శ్లో॥ చైతన్యం శాశ్వతంశాంతం వ్యోమాతీత నిరంజనం।
నాదబిందుకళాతీతం తస్మైశ్రీగురవేనమః॥

ఆ॥ ఆత్మరతినిమరిగి యంతరంతరుఁడౌచు। సుఖములనుచెలంగి సురచిరాత్మ। సమరతులనుబొంగి సంపూర్ణకాముడై। రాజభోగివగును రాజయోగి॥

శ్లో॥ మృత్యుంజయో మహారుద్రః కార్తవీర్యవరప్రదః।
ఓంమిత్యే కాక్షరంబీజం సురాసుర పదంహరిమ్॥

శ్లో॥ ఓంకారసంజాత సమస్తవేద పురాణపుణ్యాగమపూజి

తాయ। చోంకారరూప ప్రియదర్శనాయ చోంకార రూపాయ నమశ్శివాయ॥

అకారఉకార మకారములుగూడి ఓంకారబీజములయ్యెను.

శ్లో॥ అకారే దక్షిణేదేశ ఉకారంవామదేశకం।
మకారం మధ్యదేశశ్చ తస్మాత్త్రిప్రణవాత్మకం॥
అకారో వహ్నిరిత్యుక్త ఉకారోసూర్యఉచ్యతే।
మకారశ్చంద్ర సంయుక్త యేతత్ తారకలక్షణం॥

అకారము తత్పురుషము ఉకారముత్వంప్రకృతి మకారంవుభయ మధ్యఅసిపదము పరశివబీజములై ప్రణవనాదము ప్రజ్వరిల్లుచున్నది.

పంచచామరం.—— మూడులక్ష్యములను దెలిసిముఖ్య ప్రాణవాయువుల్। గూడబట్టి తనువుసిగడికొనల గూడచూడగా। నాడినిలిపితనువుదురచి నాదమిస్థరింపగా। గోడులోశమే లనీకగోనుగుమంత్రమొక్కటే॥

ఈతారక యోగమంత మందు గాన్పించుచోద్యకళలు మించిన చంద్రికావెల్గిన సూర్యబింబంబులును నక్షత్రగ్రహ తారకామండలంబులు గానంబడుచుండు ఓంకారమైదుభాగములు ౧ తారకాకారంబు ౨ దండకాకారంబు ౩ మండలాకారంబు ౪ అర్ధచంద్రాకారంబు ౫ బిందురూపంబు యీఅయిదును కలిసిన విరాడ్రూపంబునందు పంచమహాభూతంబు లుద్భవించెనెట్లన ౧ ఆకాశము తారకాకారంబు ౨ వాయువు

దండకాకారంబు ౩ అగ్ని కుండలాకారంబు ౪ జలము
మ                                    ౧
అర్ధచంద్రాకారంబు ౫ పృథ్వి బింబాకారంబు యిట్టిజ్యోతి
వా                                    య
ర్మయాకారంబు లేకమైన ఓంకారమే యుత్పత్తి స్థితిలయకా
రణాగమ్యమే పరబ్రహ్మస్వరూపము.

—[*] కందార్థము. [*]—

నాదము ముక్తికిమూలము। నాదినితెలియంగవలెను యనుభవరూఢిన్। నాదాంతమైననిష్కళ। వేదార్థమటంచు నెఱిగి॥ వేరలేదవరా॥ ఏకాంతము॥ కేరిసీవవరా॥ కూరిమితో తను। కుహరమధ్యస్థుడై। తాకుమాయగాక తల్పెదమందు చు కోరికల నెడగడిపిముక్తి। కూటమగు పరబయలు జేరుట। సారెసారెకు హృదయమందున। సాక్షిపరశివస్వస్వ రూపము॥ వేరలేదవరా॥ ఏకాంతము॥ కేరిసీవవరా॥

క॥ ఏకాక్షరవుబ్రహ్మకు। ఏకాక్షరిలోనవిష్ణు వేలునుజగముల్। ఏకాక్షరిశివతత్వము। ఏకాక్షరిప్రణవశక్తినెరుగుముజీవా॥

క॥ గురుకీమూర్తిమలసందెదు। గురుతరప్రణవంబువినుచు గురుబోధనుదా। బరికింపనాముబిందువు గురుతునకళలంటునది యౌ గుణమగుజీవా॥

తే. గీ. సద్గురూప దేశంబున సగుణనిర్గు।
ణముల యెడసమభావము ననుమనంబు।

నిర్విధ్యానంబు జేయంగ బొల్పెసంగ।
నదియె సూవెయంతర్లక్ష్య మగునుదలప॥

తే, గీ. అరసిగూర్పచిదాకాశ మందుజేర।
నాత్మయనిబ్రహ్మ కోవిదు లందురెపుడు।
చేటపడగను దీని సాదింపవశమె।
గురుగుణస్తోము లైన యోగులకుదప్ప॥

ఆపోజ్యోతి వివరము.

శ్లో॥ నీలతోయదమధ్యస్థా నవిధ్యుల్లేఖేనభాస్వరా ।
నివారశూకవత్తన్వీ పీతాభా స్వత్సణూపమా।
తస్యాశ్శిఖాయమధ్యే పరమాత్మా వ్యవస్థితః।
సబ్రహ్మాసశివత్సహరి స్సేంద్రసోస్సక్షరః పరమస్స్వరాట్॥

వ. యను యుపనిషత్ న్యాయంబుగా॥

మత్తకోకిల॥ కోటిసూర్యులు కోటిచంద్రులు । కోటికోటితటి
ల్లత । ల్యాటిగాబరిపాటిగా । నొకచోటనిల్చిన
రీతిస। మ్మెటివెల్గు దగంద్రికూటము మీదజూడు
ముదృశ్యముగా। ధాటిమాయను మాటిమాటికి
దాల్మిచే నటుమీటుచుగా॥

—[*] కంద్ధము. [*]—

విమలాంతః కరుణుడవై । నమమగుగురి నిష్టజూడ స
ద్రూపమగుగా । యమమూలసంచితంబుల । క్రమముగ తెగటా
ర్చిమించె । కట్టడిగనర♦ యంతర్జ్యోతి♦ గుట్టునీకగురా॥ కొట్టా
డిమదిలోన కోర్కాలడంచుక । దిట్టరినై మించి దీర్ఘాయువందు

ము। గుట్టుచెదరని పట్టుబట్టుచు గుప్పుగుప్పున నెరుకదాటుము। చట్టువలె పరిపూర్తినొందెదు శాశ్వతాంశపు బట్టబయలగు॥ కట్టడిగనర ♦ యంతర్జ్యోతి ♦ గుట్టునీకగురా॥

భూతములకు పైనుండెదు। నాతినివర్ణించిజూచి నాసతి కటుగా। కోతినిగనుగొనుతలపై। జ్యోతినిగుర్తించిజూచి॥ జోడుగూడన్నా ♦ కౌతుకమొప్ప ♦ గూడియాడన్నా॥ తోడునీడలేక తోడరిచిన్మయజ్యోతి। గూడినిర్భయులంది గొనియాడిమించుము। జాడలన్నియు జగద్భ్రమలగు। జన్మబంధము డాయకుండగ। వీడకన్నియు విజనమందుము। వేడుకలరెదు విమలమతిలో॥ జోడుగూడన్నా ♦ కౌతుకమొప్ప ♦ గూడియాడన్నా॥

అచలంబనగా బ్రహ్మము। యచలంబున మనసు లేదు యమలంబదియే। సుచరితంబగు యుక్తిని। ప్రచురించెదుయంతరాత్మ॥ ఘాటగజ్ఞానరా ♦ నిర్భయులయ్యే ♦ చోటెబ్రహ్మమురా॥ బూటకములకీవు బొరయకుమెప్పుడు। పాటించినిన్నెంచి పరతత్వమందుము। కోటిసూర్యులు కోటిచంద్రులు। గూడివెలిగెడు చిత్పరంబది। మీటియాపోజ్యోతినంటక। మిన్నకుండెడు నిన్నుదెలసే॥ ఘాటగజ్ఞానరా ♦ నిర్భయులయ్యే ♦ చోటెబ్రహ్మమురా॥

ముడివడ నాటింటికిపై। పడగెడిచక్రంబుజేరి నాదామృతముగ్రోలి। దడియక చవిగొనియూచి। జడమ్మగ విడనాడగోరు॥ జన్మమెసున్నా ♦ తన్మయమందు ♦ మన్మయుడన్న॥ జన్మరహితముగు చిన్మయజ్యోతిని। యున్మనిలోజూచి యున్మత్తుడై యుండు

మన్మయుండగు మౌనివినుతుని! మౌనకెప్పుడు మఱగియుండు
టః జన్మదుఃఖనివారణంబది జగములెల్లను ఘేరిసేయుము॥ జన్మ
మేసున్న ♦ తన్మయమందు ♦ మన్మయుడన్న॥

క॥ తోలిదృశ్యములునిరర్థక । ములుగావున వానివిడచి పున్న
మయుండుఁ । నిలుపమనంబును యోగికి । సులభంబగును
బరమాత్మ జూచుటకెపుడుఁ॥

సర్వజ్ఞాన వివరము.

శ్లో॥ గురుదేవో మహాదేవో గురుదేవో మహేశ్వరః।
గురుదేవ శ్శివస్సాక్షాత్ తస్మైశ్రీ గురవేనమః॥

శ్లో॥ స్వరేశం సర్వగంసర్వం సర్వభూత హృదిస్థితమ్।
సర్వకార్య కరంతత్వా స్వరజ్ఞాన ముదీర్యతే॥

శ్లో॥ స్వరేభవే ద్వేదశాస్త్రం స్వరేగాంధర్వ ముత్తమం।
స్వరేచవర్తతేలోక స్వరమాత్మాను రూపకమ్॥

శ్లో॥ స్వరోతత్వం ప్రవక్ష్యామి శ్రుణుదేవి సవిస్తరామ్।
స్వరేషా ప్రాణినామేవ స్వరయేవాది కారణమ్॥

క॥ రవిలేనిదినముకరణిని। గవిలేనిసభాస్థలంబు కైవడినుండుఁ।
భువినిస్వర జ్ఞానంబును। బ్రవిమలమతి నెరుగనట్టి పండితు
లబలా॥

శ్లో॥ రేచకంపూరకంచైవ కుంభకంచ యథాక్రమమ్।
జాతవ్యం యోగిభిర్నిత్యం స్వదేహ శుద్ధికారణమ్॥

రేచకము.— ౧౬ అంగుళములు - విడుచుట - సాహార
ము - తమోగుణము - రుద్రుడు - అధిదేవత.

పూరకము.— ౧౨ అంగుళములు - లోనికిలాగుట - ఉత్పత్తి - రజోగుణము - బ్రహ్మ - అతిదేవత - ధాతువృద్ధి - దేహకాంతి - అగ్నిదీపన గలిగించుచుండును.

కుంభకము.— గాలినిలోననిలువుట- సిద్ధి- కాయసిద్ధి- విషహరం - సత్వము- విష్ణు - అతిదేవత - దేహరుగ్మతలు - హరించును.

అగ్నిస్వరము.— రెండుముక్కురంధ్రములలో వాయువు నడుచుచుండుట.

యోగి.— వాయువును విడుచునప్పుడు హకారసౌజ్ఞ ను లోనికిపీల్చునపుడు సకారసౌజ్ఞను మదిలో నుచ్చరించుచుండవలెను హకారము-శివుడు, సకారము- శక్తి, యనిగ్రహించందగు సూర్యచంద్రనాడుల సంయోగమే పరమపదము.

పగవాడిని.— సూర్యస్వరము నడుచుచుండగా చూచిన మిత్రుడగును.

స్వరప్రశ్న చెప్పుటకు చంద్రస్వరము శుభం సూర్యస్వరము అలస్యముని గ్రహించవలెను.

సంవత్సరాది.— విదియ పుదయమున చంద్రస్వరము వుండిన నాసంవత్సరము ఆయువునకు హానిలేదు.

సంవత్సరాది విదియ మొదలు ౭దినములు క్రమముగా 3 జేసిదినములు సూర్యచంద్రుల స్వరమును చూడవలెను విదియ చంద్రస్వరము లేకపోయిన కలహము తదియ లేకపోయిన అర్థనాశము చవితిలేకపోయిన ప్రయాస - పంచమిలేకపోయి

న మిత్ర భాంధవులకుహాని షష్టి లేకపోయిన దేశనాశము సప్తమి లేకపోయిన దేశాధిపతికిహాని - అష్టమి లేకపోయిన తనకేమృత్యువుసంభవించునని గ్రహించవలెను.

ముందుసూర్య చంద్రస్వరములు నడుచువిధమును క్రమముగా తెలిపియుండుట గ్రహించందగు.

సంవత్సరాంతమందలి చతుర్దశి అంతమున చంద్రదును అమావాస్య వుదయమున సూర్యుడును నడిచిన సంవత్సరము ఆయువు పూర్ణముగానుండును వెత్యాసముగా నడిచిన హానికిహేతువుగా నుండును సంవత్సరాంతమునందలి అమావాస్య మూడుదినములు నిద్రించు కాలమందు సూర్యుడు ఉదయము లేమనప్పుడు చంద్రుడు వుండవలెను అటుతర్వాత ౧౪ వ దినము తదవదినము వారస్వరమును చూడవలెను.

## పంచభూతముల విషయము.

శ్లో॥ పృథివ్యాప స్తథా తేజో వాయువాకాశమేవచ ।
పంచతత్వాత్మకం దేహం జ్ఞాతవ్యం వరవర్ణని॥

౧. పృథ్వీఛాయ పసుపు తెలుపు కలిసియుండును నాలుగుమూళ్లలు తగులుచూ సంచరించును ౧౨ అంగుళములు నుధ్యనడుచును కృషికర్మలు సిద్ధింపజేయును.

౨. అప్పుఛాయ అర్ధచంద్రాకృతి తెలుపు ౧౬ అంగుళములుక్రిందికి అంటుచూ నడుచును శాంతికర్మలు చేయందగును.

3. అగ్నిఛాయరక్తవర్ణముత్రికోణాకారముగా పైకిలాగి చుట్టఅంగుళములునడుచును క్రౌర్యకర్మలు చేయందగియుండును.

౪. వాయువు ఛాయ నీలవర్ణము షట్కోణము ౪ అంగు ళములు అక్షముగానడుచును వశగుళికాది కార్యములకు మంచిది.

౫. ఆకాశము ఛాయ రంగు లేనిదై ముక్కులోగా సంచరించును జపధ్యానములకు మంచిది కాబట్టి యిట్టి గురురహస్యమును ఆర్జించవలెను.

శ్లో॥ గురువర్ణంచ గుణాతీతం రువర్ణం రూపవర్జితం।
గుణరూపవినాశాయ తస్మైశ్రీగురవేనమః॥

ఈ ప్రపంచ సృష్టి స్థితిలయములను దెలుసుకొనుటకు స్వర జ్ఞానమువల్లనే తేటపడుచుండు నీ ప్రపంచతత్వము అచలపరిపూర్ణ నిరాకారరూపమునందు బిందువు ధూమ్రవర్ణమై ప్రకాశించు నది శక్తి ఆశక్తితో ఓంకారసంయోగమున బ్రహ్మవిష్ణు రుద్ర మహేశ్వరజగత్తు లుద్భవించె నాజగత్తున జీవకోట్లనేక విచిత్రముగా జాతమైనందున ప్రపంచమాయెను నీ ప్రపంచ సాగరమును దాటించుటకు నావయగు వేదంబులు బ్రహ్మముఖోద్భవంబులై పెనుగొండలవలె గ్రహించువారలు లేక పోవుటచే శ్రీవిష్ణువు లోకహితంబుగా వేదవ్యాసుండై బుట్టి చతుర్వేదంబులలో శాఖలగు అష్టాదశ పురాణముల నిర్మించెను మహేశ్వరుండు శంకరాచార్యులుగాబుట్టి నలుగురు శిష్యుల నేర్పరచుకొని వ్యాసప్రోక్త సూత్రములను పురాణాదుల ననుసరించి దిగ్విజయమంది శైవ వైష్ణవ కాపాలిక శాక్త సౌర గణాపత్యములను షణ్మతముల భూలోకంబున ప్రతిష్టించి వుపనిషద్భాష్యముల బ్రహ్మసూత్రభాష్య గీతాభాష్యములనెడు మూడుభా

ష్యముల నిర్మించి భాష్యకారులని పేరందిరి అట్టి భాష్యముల
గ్రహించు సమర్థతలేనివారికి అద్వైతమకరందము ఆత్మబోధ
ప్రకాశిక దృగ్దృశ్యవివేకము మొదలగు వేదాంత గ్రంధముల
నునిర్మించె నిట్టివేదాంతరహశ్యము పూర్వము శ్రీమన్నారాయ
ణుండు బ్రహ్మకును బ్రహవశిష్టునకును వశిష్టుడు అనేకమందిమ
హాఋషులకును క్రమాక్రమంగా బోధించియున్నందున నేటివర
కు నావేదాంత మహావాక్యములు లోకమునందు ప్రకాశించు
చున్నవి అందు స్వరోదయంబనగా స్వరమనగా శ్వాస వుద
యంబనగా పుట్టుట నీశ్వాసపుట్టుటను చిత్తానుసారముగా నడి
పించుకొనుటయే ఘనమైనజ్ఞానము యీస్వరములోనే సకలవే
దాగమ పురాణాదులుత్పన్నమై క్షీణించుచున్నవి నీస్వర
జ్ఞానములేని జ్ఞాని భర్తలేని స్త్రీవలెను జ్ఞానశూన్యమైన యువ
న్యాసివలెను శిరస్సులేనిదేహమువలెను వువయోగ రహితుడై
యుండును నీదేహములు పుట్టిపెరిగి క్షీణించుటకు నీస్వరమేకా
రణము నీస్వరశక్తివలన దైవశక్తి ఐశ్వర్యము కీర్తిఆనందము
కలుగుచుండును యీస్వరజ్ఞానమువల్ల ప్రాణాది పంచవాయు
వులును జ్ఞానేంద్రియ కర్మేంద్రియ అంతరేంద్రియములనెడు
పదునాల్గున్నూ స్వేచ్ఛావర్తనలుమాని వర్తించును రాగద్వే
ష కామక్రోధ లోభమోహ మధమాత్సర్య యీర్షఅసూయ
డంభ గర్వము మొదలగు దుర్గుణములడంగును యిట్టి తారక
యోగాభ్యాసమువలన జ్ఞానేంద్రియ కర్మేంద్రియ అంతరేంద్రి
య ప్రాణాదిపంచవాయువులు స్థూలసూక్ష్మ కారణశరీరములు

తారక సాంఖ్యామనస్కులగు యోగీంద్రులకు ముఖ్యముగా గలిగియుండవలెను మానసేంద్రియ గోళములకు వాయువా ఘూర్ణించుటవలన మానసపంచాకాశముల చూచుచుండద గు నెట్లనిన (౧ గుణరహితాకాశము. ౨ పరాకాశము. ౩ దహరాకాశము. ౪ సూర్యాకాశము. ౫ తత్వాకాశము.) ఈపంచాకాశములు ధ్యానించుసమయంబున హంసధ్యానము చేయుచుండనగు (సోహం) బనుజీవపరైక్య మంత్రముచే మానసగోచరుండగు హంసయేనిష్కళ బ్రహ్మైక్యమగుచుండును యిట్లు షట్చక్రములయందు హంసను ౨౧౬౦౦ పర్యాయములు (ఇడ అనగా చంద్రనాడి యెడమముక్కు రంధ్రముగుండా వచ్చుచూపోవుచు పింగళియనగా సూర్యనాడి కుడిముక్కు రంధ్రముగుండా వచ్చుచు పోవుచుండును) సుషుమ్నయనగా అగ్నినాడి మధ్యమమున నాడుచుండును.

గీ॥ భానుమంగళ గురుస్థిరం భాస్కరునివి।
తక్కినవి చంద్రవారముల్ గలపునెఱుగు।
వారములయందు నాడులు వఱుస లేక।
నీరినడిచిన వారికి మారుశ్శైత్వం॥

సూర్యపదినములలో చంద్రుడునడిచినమొదల తూర్పుగాని ఉత్తరముగాని యెడమకాలు ముందుపెట్టి మూడడుగులు నడిచిన చంద్రబలముతగ్గును చంద్రునివారములలో సూర్యుడునడిచిన దక్షిణముగాని పశ్చిమముగాగాని ముందుకుడికాలు మూడడుగులు ముందుపెట్టి నడిచిన సూర్యబలముతగ్గును యేయిబ్బాందులు గలుగవు శాంతియగును.

గీ॥ రేచక పూరక కుంభక రీతిగాను।
నాశికము చివరదృష్టిని నాశియగుచు।
అక్షరంబును యోకొక్క లక్షగాను।
జపము చేసినవారికి సాధనంబు॥

క॥ ఏయాసనమునయుండిన। కాయమునిగిడించిబ్రహ్మ గాంచు టకొరకే। మాయను జెందక మేనను। వాయువులను గ్రందు కొగయు। వలసినలయుమా॥

పంచచామరం.— రోగముల్ హరించుమాయ రూపమిందుచారదే। ఆగమంబువర్తనాన మనుభవంబు తెలియు నీ। యోగమందు కాయసిద్ధి యున్నదంచుపల్కిరీ। త్యాగ బుద్ధి గలిగి యోగ తత్వమందు చేరుమా॥

గీ॥ తనువులోపల వాయువుల్ తగిలియుండు।
చిత్తవృత్తులుమాని విరక్తిగలిగి।
చూపునిలకడ గానుంచి చూడగాను।
అచలయోగసమాధియా వంబుజాక్షీ॥

రేచకమువలన ప్రపంచమునకు నిషిద్ధత్వమును సంపాదించును నేనుబ్రహ్మమైతినను వృత్తియే పూరకమని చెప్పంబడు కుంభకమును ప్రాణాయామమని చెప్పంబడును అందుప్రత్యాహారము మనస్సును చిత్తమునందు మజ్జనచేయుచుండుట- ధారణ యోగమనగా- చపలత్వములేక అన్నింట బ్రహ్మమేనని నిశ్చయమనస్కుడై యుండుట- ధ్యానయోగమనగా నేనుబ్రహ్మమైతినని యదార్థజ్ఞాన శూన్యమగునద్వృత్తి సమాధియనగా ని

ర్వికారమైన బ్రహ్మాకారంబునంటి శబ్దాదివిషయములు మరచి యుండుట నవద్వారములుగల పురమునకు మధ్యచక్రములున్నవి.

౧ గుదస్థానమున మూలాధారము.— ౬౦౦ శ్వాసోశ్వాసములు జపము నాలుగుదళములు నాలుగు బీజములు వ-శ-ష-స- గలిగియుండును గణనాథుడు క్రియాశక్తి సోహం ధ్యానము.

౨ మోహస్థానమున స్వాధిష్టానము.— ౬౦౦౦ శ్వాసోశ్వాసములు జపము ఆరుదళములు బ-భ-మ-య-ర-ల ఆరుబీజములు- జ్ఞానశక్తి- బ్రహ్మ- మెరుపురంగు.

3 పొక్కిలిన మణిపూరకము.— ౬౦౦౦ శ్వాసోశ్వాసములుజపం పది దళములు డ-ఢ-ణ-త-థ-ద-ధ-న-ప-ఫ- పది బీజములు విష్ణువు- యిచ్ఛాశక్తి- పసుపురంగు.

౪ వక్ష్యమున అనాహతము.— ౬౦౦౦ శ్వాసోశ్వాసములు పదిరెండుదళములు క-ఖ-గ-ఘ-ఙ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ-పదిరెండుబీజములు రుద్రుడు- ఆదిశక్తి- తెలుపురంగు.

౫ కంఠమున విశుద్ధము.— ౧౦౦౦ శ్వాసోశ్వాసములు జపం పదియారుదళములు అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఎ-ఏ-ఐ-ఒ-ఓ-ఔ- పదియారుబీజములు మహేశ్వరుడు పరాశక్తి నలుపురంగు.

౬ త్రికూటము ఆజ్ఞేయము — ౧౦౦౦ శ్వాసోశ్వాసములు అష్టదళము అష్టాక్షరితో హం-క్షం- సదాశివుడు- ఓంకారశక్తి- మాణిక్యఛాయ.

౭ సహస్రారమున పరమహంస.— ౧౦౦౦ శ్వాసోశ్వాసములు యీ షట్చక్రములుదాటి సహస్రారమున పరమగురుని యందైక్యమును బొందందగు.

బ్రహ్మదండియగు వెన్నెముకకు ఇరుపార్శ్వముల యిడ పింగళనాడులగుండా వాయువు హృదయమునకు వచ్చుటచే ప్రాణవాయువందురు నా ప్రాణవాయువు భ్రూమధ్యమమున జేరి గంగాయమున సరస్వతియను త్రికూటమునుండి కుడిఎడమ ముక్కురంధ్రముల మూలకముగా వచ్చుచుపోవుచు లయమగుచుండును.

క॥ కుడిముక్కున బింగళయును । నడమ డెన న్నడుచు చుండు నిడయనగా । నయ్యిడకును నాపింగళకును । నడుమనుషు మ్నానాడి చరించుా॥

పౌర్ణమి పోయిన పాడ్యమియందు సూర్యోదయమున నిద్రలేచినప్పుడు సూర్యస్వరముండిన ౧౫ దినములు జయం అమావాశ్యపోయిన పాడ్యమి ద్వితీయ తృతీయ్యలయందు సూర్యస్వరముండిన నాలుదినములు జయమగును సంవత్సరారంభము అనగా చైత్రశుద్ధపాడ్యమి ద్వితీయతృతీయలు మూడుదినములు చంద్రుడుండిన సంవత్సరము అనగా నొక్కొక్క దినమునకు నాలుగుమాసములు చొప్పున జయముగలుగును పాడ్యమిలేకపోయిన హానియును విదియలేకపోయిన ధననాశమును తృతీయ లేకపోయిన భయమును చవితి వారస్వరము లేకపోయిన మిత్రవిరోధమును పంచమి వారస్వరము తప్పిన చుట్టు

ములకు ప్రాణభయమును షష్టిలేకపోయిన పరస్థలయాత్రయు న్నూ సప్తమిలేకపోయిన మహారోగమును అష్టమిలేకపోయిన మరుసటి సంవత్సరాష్టమిలోగా మరణము సంప్రాప్తమగును.

చంద్రసూర్య తత్త్వముల వివరము.

౧ పృథ్వితత్త్వము.— ౧౬ అంగుళములు ముక్కురంధ్రమున పూర్తిగానడుచును అన్ని స్థిరకార్యములకు శుభమొసగుచుండును వుద్యోగమునకు శుభమగును.

౨ ఆపోతత్త్వము.—౧౨అంగుళములు ముక్కురంధ్రము క్రిందుగా తాకినడుచును చరకార్యములకు శుభముగలిగించును.

3 తేజోతత్త్వము.— ౮ అంగుళములు నాసికపైవైపు దాకినడుచును లయకార్యములకు మంచిది శుభకార్యములకు హాని మరణము చెర్సుకాల్వాత్రవ్వించుటకు మంచిది.

౪ వాయుతత్త్వము.— ౪అంగుళములు నాసికపుటమునకు అడ్డముగానడుచును తీవ్రకార్యములకు మంచిది శత్రువులకు చిక్కకుండెదరు ప్రయత్నము జయమగును.

౫ ఆకాశతత్త్వము.— ౧౬ అంగుళములు ఝుంకారము గానడుచును దేవతలపూజలు అర్చనలకు మంచిది.

తత్త్వముల నెఱుగుటకు ౧౬ అంగుళముల పొడవుగల పుల్లకొనకు దూదిచుట్టి ముక్కురంధ్రములకు సూటిగానుంచుకొని పరీక్షించుచుండిన ఆయాతత్త్వములు గోచరమగుచుండును.

సూర్యచంద్ర స్వరములు రాత్రింపగళ్లు ఘడియకు తత్త్వముమారుచు రెండుముక్కురంధ్రములలో దినం౧కిపగలుటమా

ర్లురాత్రి ఒమార్లు మారుచుండును చంద్రస్వరము నడుచునపు డు తూర్పుఉత్తరముపోరాదు సూర్యస్వరమునడుచు నపుడు దక్షిణం పడమర పోరాదు.

అనుభవమైన తర్వాత ప్రశ్నలు చెప్పుటకు యత్నించిన చెప్పవచ్చును ప్రశ్నపృథ్వితత్త్వమైతే పోయినతట్టున శుభము గానున్నట్టును జలతత్త్వమైతే సమీపములేక యెదురుగా వచ్చు చున్నట్టును తేజోతత్త్వమైతే రోగముతో నున్నట్టును వాయు తత్త్వమైతే వొకతావునుండి మరివొక తావుకుమారి పట్టును ఆకాశతత్త్వమైతే మృతిజెంది యున్నట్లును లేక దేవతార్చన లోనున్నట్లును జెప్పవలయును ఆయావారస్వరమును రేచించి పూరించి కుంభించి కుడికాలు ముందిడినడిచినజయము సూర్య చంద్రనాడులు అక్రమముగా నడుచునట్లు తోచినప్పుడు క్రమ ముగా త్రిప్పుకొనుటకుమార్గము యోగదండము మెడతట్టుగా గాని కుడితట్టుగాని అదిమివుంచుకొనిన సూర్యస్వరము చంద్ర స్వరముగా యోగాభ్యాసమువలన మారుచుండును యిదియు నుంగాక పూరించి కుంభించెడు యోగముచే సూర్యుడుచంద్రు డుగా మారుచుండును యోగాభ్యాసమువలన సునాయాసము గా మార్చుకొనుట మంచిది॥

## రేచకపూరక కుంభకముల వివరము.

రేచకమనగా లోనిగాలిని విడచుట పూరకమనగా లోనికి పీల్చుకొనుట కుంభకమనగా వాయువును నాభిపంకజ స్థానముననిల్పుట అకారము రేచకము, ఉకారము పూరకము,

మకారము కుంభకమని, సాక్షులు రేచకమువల్ల దేహము పుష్టి గల్గును ధాతువృద్ధియగును దేహమునకు కాంతిగల్గును, పూరక ముత్పత్తి కారణమగును. అగ్నిబలమునిచ్చును విషయముల దంచును అన్నముజీర్ణమగును సకల దోషహారంబై యుండును అభ్యాసయోగిదినానికి ౬౦ఘడియలను ౬౦విఘడియలుగా నెంచి ౧౨ మాసములకుపంచి మాసఫలమును గనవచ్చును కూర్చుండిగాని నిలువబడిగాని పరుండిగాని స్వరమును మార్చుకొనుచుండవచ్చును అమావాస్యపోయిన ౧౨దినములు చంద్రునివి పౌర్ణమిపోయిన ౧౨దినములు సూర్యునివి ఆదివారము మంగళవారము గురువారము శనివారము రాత్రిళ్ళు చంద్రునివి పగళ్లు సూర్యునివి సోమవారము బుధవారము శుక్రవారము రాత్రిళ్లు సూర్యునివి పగళ్లుచంద్రునివి నాగ్రహించి స్వరమును కనిపెట్టి నాడించుచుండవలెను ఓంకారము ప్రథమస్వరము యందుజారతమైన పంచాక్షరములు కలిసి (ఓంనమశ్శివాయ) యనబడు మంత్రము (ఓం) అనగా త్రిమూర్త్యాత్మకమైనది (శ్శివాయ) యనగా శుద్ధమైన పరబ్రహ్మమును (నమః) అనగా నమస్కరించు చున్నానని) భావము అట్టిమంత్రోచ్చారణచే బ్రహ్మవిష్ణురుద్రమహేశ్వర సదాశివులు మొదలగు దేవతలును లోకమునందు ఋషులుమొదలయిన పరమభక్తులు జపించుచున్నారు సహస్రారమున త్రికూట శృంగాటకముపైని బ్రహ్మరంధ్రమునకు త్రాసువలె (శివశక్తులు) తులతూగుచుండును యేకట్టు మ్రోగ్గితే ఆకట్టు ప్రాణవాయువగు జీవుండు ఆడు

చుండును యిదియేఐక్యస్థానము శివజీవులే (హంస) యనబడు హాకారము తత్పదము సకారము త్వంపదము ఐక్యమొందు చుండుటయేఅశిపదము యిదియే శివజీవేశ్వరైక్యమను జీవయజ్ఞము హాకారముసోమము సకారము అగ్నిబిందువే మోక్షస్థానము వీనికే అగ్నిష్టోమ యజ్ఞమనియుపేరు జ్ఞానికిప్రత్యగాత్మ స్వరూపము పరమాత్మ స్వరూపమైన బ్రహ్మమే కాబట్టి జగత్తు బ్రహ్మవ కంటే భిన్నముకాదు ఇడాపింగళలు సంచరించు ప్రవర్తనలు లోపలవెలుపల చూచునప్పుడు సుషుమ్నానాళమును చెంది సంచరించుచుండును.

ఆ॥ అచలహంసరూప మెచటసంభవమగు।
నెచటసంచరించు నెచటనడగు।
నదినెసుషుమ్న యదినెపోద్వీదళాబ్జ।
మదినూత్మదృష్టి నరయుమనసు॥

శ్వాసమును ప్రాణమనబడును అట్టిప్రాణములుఆరు,ఫలమనబడును అట్టిఫలములు అరువైఅయితే ఘటికయనియును కాలదుందుభియనబడును యిట్టికాలదుందుభులు ఘడియకుయున్నాట అరువైప్రాణములు వొకఘటికయు అట్టిప్రాణములు రెండువేలయేనునూర్లగును అట్టిఘడియలు ౬౦ వొకఅహోరాత్రము వగటియందు ౩౦ రాత్రియందు ౩౦ భాగింపబడియున్నవి, యిట్టివి౩౦ దినములు నెలయగును, రెండునెలలు ఋతువగును,౩ ఋతువులు అయనమగును, ౬ఋతువులుగాని రెండుఅయనములుగాని వొకసంవత్సర మగుచుండును.

౬౦ ప్రాణములు ౧ ఘడియ ౬౦ ఘడియలు ౧ దినము, ౩౦ దినములు ౧ నెల, రెండు నెలలు ౧ ఋతువు, ౬ ఋతువులు సంవత్సరము లేక ౨ అయనములు ౧ సంవత్సరము, ఆయుష్ప్రమాణములు తెలుసుకొనుటకు యోగి గ్రహించవలసినది చైత్రసంక్రాంతి మొదలు ౫ దినములున్ను సూర్యుండుండిన ౬౦ సంవత్సరములు బ్రతుకును, ౧ జేష్టసంక్రాంతియందు ౫ దినములు సూర్యుడుండిన ౪౦ సంవత్సరములు బ్రతుకుదురు, శ్రావణ సంక్రాంతియందు ౫ దినములు సూర్యుడుండిన ౧౨ సంవత్సరములు బ్రతుకుదురు ఆశ్వీజ సంక్రాంతియందు ౫ దినములు సూర్యుడుండిన ౧౫ సంవత్సరములు బ్రతుకుదురు, మార్గశిర సంక్రాంతియందు ౫ దినములు సూర్యుడుండిన ౧౭ సంవత్సరములు, మాఘసంక్రాంతి ౫ దినములు సూర్యుడుండిన ౩ సంవత్సరములు ఆయువు.

—[*] కందార్థము [*]—

వికలసుఖదుఃఖములదా। ప్రకటితముగ నెంచిజూచి ప్రజ్ఞానిధివై। వికటంబులేక వెలగిన। నికరంబగు పూర్ణమదియె। నిజమూనిగనరా ♦ సామీప్యమా ♦ భజియించిమనరా ♦ విజితమానవదృష్టి వీక్షించిలోమించి। యజపాదిక్రియలొడ్డి। యచలుడై యుండుట యజభవాదులకందనిదివ్యాద। యంతరాళము నిండియున్నది। గజబిజనివిడి నిర్వికారము। గతిగనుంగో ముడారితోద్పడి। నిజమూనిగనరా ♦ సామీప్యమా ♦ భజియించిమనరా॥

పైసంక్రాంతులలో సూర్యుడుండకతప్పినయెడల విపరీతము కల్గుచుండును రేచకపూరక కుంభకములు గురుముఖంబున దెలిసి అభ్యాసముచేయు యోగికి సాధ్యమైయుండును సంక్రాంతులలో నియమములేప్ప నడిచినవారికి సుఖదుఃఖములు విపరీతముగా నడుచుచుండును.

రేచకమునకు రుద్రుడున్ను పూరకమునకు బ్రహ్మయున్ను కుంభకమునకు విష్ణువున్ను అధిదేవతలు సూర్యచంద్రస్వరములు మార్చిమార్చిత్రిప్పుటకు అభ్యాసముచేసినయోగికి జనన మరణ సుఖదుఃఖములు తెలిసి కాలమునుజయించును గురుశిక్షపొందినయోగికి సునాయాసమగుచుండును సూర్యుని స్వరము చంద్రునిదిగా చంద్రునిస్వరము సూర్యునిదిగా నడుచుచుండిన అపజయము చంద్రస్వరములో సమమైయుండును సూర్యస్వరములో విషగుణములు ఉభయస్వరములుసావుకాశమని చెప్పవలెను నిద్రకు పోవుకాలమందు యేస్వరము వుంటూవున్నదో ఆస్వరముతక్కె కయునించి లేచునప్పుడుండు స్వరమును కనిపించి లేచుచుండవలెను స్యూర్యునివారమందు సూర్యస్వరముండుటగనినిద్రించవలెనుచంద్రునివారమునందుచంద్రుడుండుటగని నిద్రించందగు చతుర్ధశి అంత్యమునచంద్రుడు అమావాస్య ఉదయమందు సూర్యుడును నడుచుచుండిన ఆసంవత్సరమంతా ఆయువు దృఢముగానుండునని తెలియంగనగు హాకారముచేత బ్రతిపాదించుచున్న పరబ్రహ్మమునుచేర్చి ప్రాణవాయువు నిలుపుటయే కుంభకము అందు ఆత్మబింబమునుచేర్చి లయమగు

చుండు ప్రాణవాయువును రేచకముసందు జేర్చిన సకారము
తోడ నీమూటిని జక్కగా తెలుసుకొని పరమానందమును
బొందుచుండుటయే (హంస) ధ్యానపరవశత్వము.

—[*] కందార్థము. [*]—

కేవలనిర్గుణ మనిమెరు। నావపయిఁ జేరిసూర్య నాడికి
ముందై । తావుకొని చంద్రనాడిని। జీవునికుంభించిపట్టి॥ చెనకి
దాటుమురా॥ నిరాలయమా॥ యునికిగన్గొనరా॥ అనిలము రే
చించి యనలునకర్పించి । పనివడపూరించి పొల్పడకుంభించు।
తనివిదీరెడు తన్మయత్వము తాల్మితోడను బయలుదాకుట।మ
నసజ్ఞప్తిసమాధియుక్తులు మానితంబగు ప్రజ్ఞలోవెలి॥ చెనకిదా
టుమురా॥ నిరాలయమా॥ యునికిగన్గొనరా॥

లింగాంగ విచారణ.

శ్లో॥ అచింత్యా వ్యక్తరూపాయ నిర్గుణాయ్మ గుణాత్మనే।
అశేషజగదాధారా మూర్తయే బ్రహ్మణేనమః॥

శ్లో॥ మనసోహ్యున్మనీభావాత్ ద్వైతంనైవో పలభ్యతే।
యథాయాత్యున్మనీభావం తథాతత్పరమంపదం॥

క॥ అంగము జీవునికిరవగు। లింగము జీవాంశమెఱుక లెక్కిం
చినచో। లింగాంగంబులు రెండును । సంగంబాబయలునం
దు సమముగజీవా॥

క॥ అంగములోపగుజీవుడు। లింగంబై దెలువుమదికిలీలగులోనై
లింగాంగంబులు మెఱుకను। పొంగెడు బయలందుజేరి పొ
లియునుజీవా॥

శ్లో॥ అవ్యక్తమవ్యయంశాంతం నితాంతంయోగినాంప్రియం।
సర్వానందస్వరూపంచ తద్వందేబ్రహ్మసర్వగమ్॥

మననమందు చిదాకాశమును జీవాత్మగాను జీవాత్మను చిదాకాశముగాను చేయుచు యోగిసరవిగా శబ్దచిత్తుండై (ఖం బ్రహ్మమనిన్ని) (ఆకాశశరీరం బ్రహ్మమనిన్ని) (ఖంమధ్యేకురు చాత్మానం। ఆత్మమధ్యేఖఃకురు॥ ఆత్మానఖం మయకృత్వా। నకించదపచింతయేత్॥) అనున్యాయంబుగా భావాతీతం సుఖానందం। మండలత్రయమధ్యగం। లింగత్రయత్రిలత్యాంతం భావలింగం మహంభజే॥) (నిర్గుణం నిర్మలం నిత్యం నిరాకారంనిరంజనం। నిరాధారంనిరుపమంచ భావలింగం మహంభజే॥)

అనిస్మరించందగు స్థూలసూక్ష్మకారణ నిర్మలాంగములు నాలుగువిధములై యున్నవి ఆనంద, చిన్మయ, చిద్రూప, శుద్ధాంగములు, నాలుగువిధములైన లింగములు, జీవాత్మ, పరమాత్మ, అంతరాత్మ, నిర్మలాత్మలు, నాలుగువిధములై యున్నవి.

పంచచామరం.— బంగిబుద్ధిచేతబూని బంగుత్రాగిమత్తులై। వెంగళులనుకేరిన్మత్తవెడగుబుద్ధులబ్బునే। యంగమందుసంగమూని సంగుమీరుభక్తిలో। భంగమమరు లింగదేహబయలులో వెలిమించిరా॥

సద్గురుకటాక్షంబుచే సరవిగా సుఖపడిన సంభావ్యమై సద్భక్తిసేవ్యమై శాశ్వతంబై నిగమసంస్తుత్యమై సత్యజ్ఞానమనంతబ్రహ్మమైయొప్పుచున్న చిద్బహ్మమునే నివేదించుటయుం దా

న్నక్తితో నాత్మరాధనయందు చిద్రూపనివేదనం బొనర్చుచుం డుటయే శుద్ధాంగమైన కారణలింగ బ్రహ్మంబనందగు.

శ్లో॥ అన్యవిద్యాపరిజ్ఞాన మవశ్యం నసర్వంథవేత్।
బ్రహ్మవిద్యాపరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరంథవేత్॥

శ్లో॥ శివయోగపదానందం శివరూపంచిదాత్మకం।
పంచబ్రహ్మకళాతీతం భావలింగంమహంభజే॥
(ధర్మార్థ కామమోక్షాణాం శరీరంసాధనంయతః॥)

మత్తకోకిల॥ పాపకర్మముజేసిపిమ్మట పాపమందు మునుంగు చున్। పాపరూప ఫలంబులందుచు ప్రాప్తకా మ సుఖంబులో। దాపమంది దరిద్రదోషయు తంబునంకదుఃఖులై। చాపలంబున నీచయో నుల। జన్మమందుదు రెప్పుడున్॥

క॥ వినుజీవుడు పనాతను। డనఘుడునిజ కర్మవశత నద్రుపదే హం। బునుబొందు దేహపాతం। బునవెవ్వుడు జెడదతండు భూసురవర్యా॥

క॥ ఇదుములు వచ్చినవేళను। గదుదిట్టినదేవుడేమి గావించు మమున్। దొడరిన కర్మవశంబున। బుదమిని ననుభవము నొందు పురుషుండిలలో॥

గీ॥ మింటిమంటిసందు మిన్నవారందరి।
నెన్నగానుదరమె యెరికైన।
నున్నవారుచావ నున్నవారేసుమీ।
విశ్వదాభిరామ వినరవేమా॥

క॥ చిరకాలముతపమునైనను। హరియింపగనోపుజిత్తమనిపె ద్దలువ। మ్మరుజారులకును జారిణి॥ కరణినియదరించు మనసు గామాదులకున్॥

క॥ పరమందెదు తత్వార్ధము। పరికింపనివారుజూడ పామరులి లన్। స్థిరమార్గమందుబుద్ధిని। సారనివరదిమెట్టికర్మ నుత్తి రయితెలియన్॥

క॥ అంగమునిర్మలబిందువు। లింగమునాదంబుపరమ లింగాం గముహ॥ సంగమెమంగళకళయని। లింగాంగులు దెలియు దురు చలింపనియుక్తిన్॥

యిందుకు సుఖదుఃఖములు రెండుగలవు మొదటిసుఖ మనగా మోక్షసుఖము దుఃఖమనగా మరణదుఃఖము నీరెంటి నిమించిన సుఖదుఃఖములులేవు దుఃఖములేనిదే సుఖముమోక్ష స్థానమైయదని గ్రహించందగు.

—[*] కందార్ధము. [*]—

రెంటికిమధ్యనుజూడగ। నంటియునంటకనుబ్రహ్మమావ లిదైము। కృంటితుదనితాంతపుమి। న్మింటనపరిపూర్ణమమ్మె॥ మేలిమిగనరా॥ తన్మయయమూని॥ లాలితమనరా॥ ప్రాలుమా లకనీవు పాపలనిక్కించి। మేలైనత్రిపుటిలో మిన్నందు చుండిన। పోలికల్ పుంఖాను పుంఖము పొత్తువిడినిన్నంచి మించెడి। లీల మానసభావపరములు। లింగభంగం బమరునిష్కళ॥ మేలిమిగన రా॥ తన్మయమూని॥ లాలితమనరా॥

జీవబ్రహ్మైక్య జ్ఞానముగలయోగి ప్రణవాంగమయినజీవు

ని స్వచ్ఛమైన బ్రహ్మానంద రసబిందువనియును శుద్ధస్ఫటికము
తో సమానమై యానందబిందువు నందుశోభించి ప్రకాశించెడు
ఈశ్వరునిజ్యోతియగు ప్రణవనాదమును లింగస్వరూపముగాను
న్నా అంగస్వరూపుడైన జీవుని అభేదైక్యము పరమశివకళయ
ని వికల్పములేని శ్రవణమనననిధి ధ్యానములచే తెలుసుకొను
చుండును అట్లు తెలియుటే తెలివిఅతెలివిచే స్వరూపలింగము
ను సమాధిని చిత్తంబ్రహ్మాకారముగా పరిణమింపజేయుచుండు
టయే నిర్వికల్పసమాధియనంబడు నట్టిజీవబ్రహ్మైక్యమనుఅఖం
డాకారవృత్తియే ముక్తియనంబడు నట్టిశివజీవైక్యము సంధాన
ము జేయుచుండెడి యోగులకు అంతఃకరణము బ్రహ్మాకారము
గా పరిణమించుటవల్ల జీవుడనే వ్యవహారములేకపోవును యిట్టి
జీవన్ముక్తియే మృత్తికాశూన్యమైన ఘటాకాశము మహాకాశము
నందు గలియునట్లుగా పరమాత్మయందు జీవభ్రాంతి లీనమై పరి
పూర్ణోహం అనేశబ్దముచేత కృతార్థులయ్యెదరు.

మత్తకోకిల॥ మాయయాత్ముడు మాయజీవుడు మాయయీ
శ్వరుడారయ। మాయచిత్తము మాయబుద్ధి
యు మాయకోపము ప్రాణముల్ । మాయచి
త్కళ మాయబిందువు మాయనిష్కళ జ్యోతి
యు। మాయవిష్ణుడు మాయశంభుడు మాయ
బ్రహ్మయు లోకముల్ ॥

—[*] కందార్థము. [*]—

లింగాంగ భంగమేర్పడ। సంగతిలేనట్టిబయలు సమకో

నినంతట। పొంగుచు నాత్మార్పణమని। మంగళకరచిత్తవృత్తి॥ మఱిగియుండుమురా॥ చిచ్ఛక్తినంటి॥ మఱియు చుండుమురా॥ పరికించినీలోన పరమహంసనుగూడి। నిరతమొక్క రీతి నిర్వాణ పథమూని। స్థిరముగామది బయలులోనగు సిద్ధకాయాపురినిజే రగ। దురితజాలములన్ని బొలియును దొడరిమన్మయ లింగము గుగురి॥ మరిగి యుండుమురా॥ చిచ్ఛక్తినంటి॥ మఱియు చుండుమురా॥

విశ్వరూప సందర్శనము.

శ్లో॥ భక్తిసాధనవక్తాచ యోగసిద్ధిప్రదాయకః।
నానావిభూతివక్తాచ। శుద్ధధర్మా వబోధకః॥

శ్లో॥ యోగాంమృత రసంపిత్వ వాయుభక్ష స్సదాసుఖి।
యమమభ్యాస తేనిత్యం సమాధి మమృతాసనమ్॥

శ్లో॥ వివిక్తదేశఆసీనో విరాగో విజితేంద్రియః।
భావయేదేకమాత్మానం తమనంత మనవ్యధిః॥

అనగా ఏకాంతస్థలముజేరి మనోబుద్ధి చిత్త అహంకారము లన్నింటిని అద్వితీయ పరమాత్మయే తానగుచుండునట్లుభావించి చూచుచుండుటయే విశ్వరూపసందర్శనమని తెలియగనగు.

శ్లో॥ ఆత్మనే వాఖిలందృశ్యం ప్రవిలాప్య ధియాసధీః।
భావయేదేకమాత్మానం నిర్మలాకాశ వత్సదా॥

అనగా తానుభావించుటలో నిర్మలాకాశవత్తుగా చెదరక తననే జూచుచుండుట విశ్వరూప దర్శనమగును.

శ్లో॥ రూపవర్ణాధికంసర్వం విహాయ పరమార్థవిత్।
పరిపూర్ణచిదానంద। స్వరూపేణావతిష్ఠతే॥

అనగా అంతటా నిండియున్నట్లు దోచినచిదాకాశ స్వరూప పరమాత్మతో జేరుకొని లీనమైస్వప్రకాశుడై పరిణమించు తీచ్ఛయే పరబ్రహ్మస్వరూపము.

క॥ ఇదియిదియనాత్మనేగా। నిదిబ్రహ్మము నేనటంచు నెఱుగ నెఱదమై। కదలనిమది యిటులామది। గదిసి తెలియునతడ స్వప్రకాశుడగుగా॥

క॥ ఇనుడస్తమించుతటినా। తనికిరణములతనితోడ దగజనురీతిగా। ఘనుమానసంబుపొలిసిన। మునుకొనితద్గతవికారము పొలియుగదా॥

తే॥ ఇంద్రియ మనంబు లటుచేరి।
యించనేని నేడలంచితినంచు నీ వెఱుగబోక।
నిశ్చలుడనంచు దెలియుము నిన్నుగాంచి।
తనియు నతినిశ్చలములగు నంతమీద॥

క॥ గారీశవాదు లాత్మాకారా। కారితనువృత్తిగతి నాయందుం। జేరిరమించుమ నుండుట కారణముగ రామపదము గలిగెన్నారు॥

మ॥ తలపంబూర్ణము నిర్వికారముగు తత్వం బిట్లుభాసిల్లగా।
దెలియన్నరక మూఢులైన నహలీశేహేంద్రియప్రాణ బు।
ద్ధులనెల్లప్పుడు నిగ్రహించుటకు నెంతోరక్తులై యాత్మునిం।
దెలియం జాలరు వారికింగలుగునే ధీసాక్షినీక్షింపగా॥

తే॥ దంతిరూపంబు చేకొన్న దారుపరయు।
దారువగుగాక పరికింప దంతియగునె।
విశ్వరూపంబు చేదోచు విశ్వమూర్తి।
విష్ణువగుగాక పరికింప విశ్వమగునె॥

మానసంబున భావించెడు విశ్వరూపధ్యానంబున నదీసదాబ్ధి జలంబులతో నభిషేకంబును చతుర్దశభువనంబులు గంధంబుగను సూర్యచంద్రగ్రహ నక్షత్రములు కంఠమాలగాను ఆకాశంబు పుష్పంబుగాను వాయువుధూపంబుగాను అగ్నిదీపంబుగాను యిట్టిమహాపంచభూత సంయోగంబయిన నైవేద్యప్రసాదంబని నర్పించితినని గైకొమ్మని నమోన్నమః అనినిర్వాణుండై యున్నయోగి చంద్రుడే విదేహకైవల్య సిద్ధిబడయుచుండును. దృక్కు- దృశ్య- ద్రష్ట- నీమూటిలో దృక్కు-చూచు నేత్రములోని తెలివి అనగా ప్రజ్ఞ నాప్రజ్ఞానమే బ్రహ్మమని యున్నది- దృశ్యమనగా కంటికి గోచరించెడిది - (యద్దృశ్యం తన్నశ్యం) బనియున్నది. ద్రష్టయనగా అతీతముగా సాక్షికిసాక్షి స్వరూపమైన పరబ్రహ్మముగా నెఱుంగవగు సద్రూపమనగా తోలుతిమాడంబడునది చిద్రూపమనగా చూడంబడు దానిని మనస్సున చూడబడునది ఆనందమనగా సద్రూప చిద్రూపములు లేక లీనమై వొల్లుసూరచి యుండుట.

తే॥ బ్రహ్మవిజ్ఞాన సమదృష్టి భవహరంబు।
బ్రహ్మభూతాంత రాద్యంత ప్రముదితంబు।

బ్రహ్మానందైక్య మగునాత్మ పరవశంబు।
యోగమాధుర్య రాఘవ యోగివర్యా॥

తే॥ నిష్కలంబైన తనయాత్మ నిజమెఱింగి।
ధ్యానమొనరించు చుండును ధన్యుడరయ।
నట్టివానికి మఱుజన్మ మపని లేదు।
యోగమాధుర్య రాఘవ యోగివర్యా॥

—[*] కందార్థము. [*]—

సూటిగను విశ్వరూపము। నాటినమది నెఱిగి చూట్కి నామారుతమున్ । మీటుచు కాటుకపక్షులు। మాటున నాశిఖర మెక్కి॥ మమతవిడ ద్రొక్కి ♦ దహరాకాశ ♦ క్రమమెఱిగిని క్కి॥ విమలవిలోకివై వివరించినిన్నించి। సమగురి దాటుట సం కల్పశూన్యము। యమనియమ యోగాదివృత్తుల। యందు కేవల పూర్ణమునగురి। యమలమవ్యయ నిర్వికల్పకి। మందిమ దిలో నిండు ప్రభగని॥ మమతవిడ ద్రొక్కి ♦ దహరాకాశ ♦ క్రమమెఱిగిచిక్కి॥

శ్లో॥ బ్రహ్మావిష్ణురుద్రశ్చ ఆదిత్యశ్చంద్ర దేవతా॥
శరీరాభ్యాంతరే దేవి యోపి జ్ఞేతథ వేద్గురు॥

బ్రహ్మవిష్ణు మహేశ్వరుడు సూర్యచంద్రులు నక్షత్రములు మొదలయినవి శరీరమందు తెలిసికొనువాడే గురువుగా గ్రహించవలెను.

శ్లో॥ సప్తవింశతినక్షత్రం సప్తద్వీపా నవగ్రహాః।
శరీరాభ్యాంతరే దేవి యోపి జ్ఞేత థ వేద్గురుః॥

సప్తద్వీపములు యిరువదియేడు నక్షత్రములు నవగ్రహములు వీటిని శరీరమునందు దెలిసికొనువాడే గురువుగా గ్రహింపందగు.

శ్లో॥ సాగరాస్సప్తవేదాశ్చ చత్వారోష్ట దిశస్తథా।
శరీరాభ్యంతరేదేవి యోవిత్తేత భవేద్గురుః॥

యేడు సముద్రములు నాలుగు వేదములు అష్టదిక్కులు శరీరమునందు గనువాడే గురువుగా గ్రహించందగు.

శ్లో॥ విద్యాగృహీత్వా సర్వాశ్చ సోదాసీనోభవేద్యది।
తత్రతిష్ఠతి నజ్ఞానం యథాశిక్షిత పక్షిణి॥

గురువునొద్ద విద్యగ్రహించిన తర్వాత గురువును అలక్ష్యము చేసినయెడల పక్షిమాటలునేర్చి గూటినుంచి వెడలి పక్షిసమూహములోగలసి మాటలుమరచి పోవునట్లు జ్ఞానముపోయి యజ్ఞానమే సంభవించును నేర్చినవిద్య ఫలించదు.

దర్పణభావ వివరము.

శ్లో॥ పదాసర్వగతోప్యాత్మా నసర్వత్రావభాసతే।
బుద్ధావేవావభాసేత స్వచ్ఛేషు ప్రతిబింబవత్॥

అనగాపరమాత్మ అంతటవ్యాపించి యున్నను జడములైన వెలుపలి దృష్టిగలవైన యింద్రియముల చేత చూడంబడదు రాగద్వేషరహితమైన బుద్ధిచేత చూడంబడును యెట్లనగా సూర్యాది తేజస్సు లంతట వ్యాపించుచున్నను అద్దమునీళ్లు మొదలయిన పరిశుద్ధ వస్తువులయందు దక్క నన్యపదార్థములయం దెట్లు

ప్రతి ఫలించవో అట్లే ఆత్మ సుజ్ఞానతత్త్వ పూర్ణోదయమందు ప్రకాశించును.

శ్లో॥ జీవన్ముక్తి స్తుతద్విద్వాన్। పూర్వోపాధి గుణాం స్త్యజేత్।
సచ్చిదాది ధర్మత్వా ద్భజేద్భ్రమరకీటవత్॥

అనగా స్థూలసూక్ష్మాది శరీరములు సత్వాదిగుణములను పరిత్యజించిన సుజ్ఞానమే జీవబ్రహ్మలకు ఆనంద లీలావిలాస సంయోగ మందించు చుండును.

శ్లో॥ యల్లాభాన్నాపరోలాభో యత్సుఖానాపరంసుఖం।
యజ్ఞానాన్నాపరంజ్ఞానం తద్బ్రహ్మేత్యవధారయేత్॥

అనగా ఏస్వరూపానుభవము సమస్తలాభములకంటె గొప్పదియో సుఖములలో నేదినతిశయమో జ్ఞానములో సాక్షాత్తుగామోక్షము సిద్ధించుటకు హేతువైన సుజ్ఞానతత్త్వపూర్ణోదయ జ్ఞానమే పరబ్రహ్మానంద సుఖమనుభవించు జ్ఞానమని యెరుంగవలెను అండాండ పిండాండములను బ్రహ్మాండములను పోల్చిచూచునది నేత్రాండము అనగా నేత్రములోని తెల్లగ్రుడ్డు అండముఆగ్రుడ్డులోనిబిందువు స్ఫటికపుపాప, పిండము ఆపాపలోని వెలియగునదియే బ్రహ్మాండము ఆతేజస్సులోనిది ఆకాశము ఆయాకాశములో ప్రకాశించునదియే స్వప్రకాశమైన పరబ్రహ్మము నల్లగ్రుడ్డుగంగ అందులో నీలమైనపాప యమున ఆపాపమధ్య వెలిగెడువెలుగే సరస్వతి ఆవెలుగుమధ్య నిష్కళతో విరాడ్రూపము గ్రుడ్డుమట్టూ యెరుపు బ్రహ్మ అకారము రాజసగుణము- తెల్లగ్రుడ్డు విష్ణువు ఉకారము సాత్వికగు

ణము- వల్లగ్రుడ్డుశివుడు మకారము తామసగుణము- పాపలో
నికళయం దోంకారము నాఓంకారమునకు పరమైనదియే నిష్క
ళంక పరబ్రహ్మము- నిశ్శబ్దమువరకు గోచరించుచుండు జ్ఞప్తి
యే మెఱుక మెఱుకమరుపులు లేనిదే పరమాత్మ స్వరూపము
ఇట్టిదే హేంద్రియాది ప్రపంచమును మిథ్య జేసి నిష్కళయందు
తిచ్ఛవడివర్ధిల్లుచుండుట యేహంసభావసుజ్ఞానతత్త్వపరిపూర్ణో
దయము అట్టిపరిపూర్ణోదయమే బ్రహ్మనందము పావయుండలి
బిందువయే కుండలి ఆకుండలి తేజమే చరాచరమంతా లోవెలి
గానిండి బట్టబయలై యున్నది అట్టిబట్టబయలే చిత్ బ్రహ్మమైన
నీవు నిన్నెరుంగక తన్మయమందుటే శివజీవైక్యసోహంభావము
అట్టితన్మయభావమందు నాభిలో బ్రహ్మపురము కంఠమున శివ
నిపురము ముఖమున వైకుంఠ పురము కపాలము స్వర్గద్వా
రము. నోరు ఋగ్వేదము చక్షువులు యజుర్వేదము నాసిక
సామవేదము కర్ణములు అధర్వణవేదములై యొప్పు నీవిశ్వరూ
పమైన దేహమనెడు దేవాలయంబున త్రికూటము కాశీవిశ్వనా
థేశ్వరుడు అదియే జ్యోతిర్లింగము సోహంభావ ధ్యానమే పర మే
శ్వర దర్శనము హంసం యను రెండక్షరములే తిరుమంత్రము
యీ అక్షరద్వయములే హంస ఇదియే అజపాగాయత్రి ఇడపిం
గళ సుషుమ్నలు సంగమించుటే ప్రణవము ఆధారము మొదలు
అన్నిచక్రములలో సంచరించుచుండు హంసయే పరమాత్మస్వ
రూపము ఇట్టిపరమాత్మ స్వరూపధ్యానమే సమాధి అట్టిసమా
ధిలో విశ్వమంతా వ్యాపకమైన మనస్సు సూర్యచంద్ర నక్షత్ర
ములు చతుస్సముద్రములు వెలింగించు చుండెడి మెఱుకను

గూడి దాటుటయే త్రికూటమధ్య జేరిన హంసభావము హంసో హమందు సాక్షి తన్మయత జెందుచుండుటయే జీవన్ముక్తి యని పరిపూర్ణ నిరంజన పరబ్రహ్మంబు వ్రతంబుగా నెన్నందగు నిట్టి పరిపూర్ణ సుజ్ఞానతత్త్వ పూర్ణోదయమందు ప్రావీణ్యుండగు యోగీంద్రునకు నిరాటంకముగా తానే బ్రహ్మమై బ్రహ్మమే తానైన యానంద పరవశత్వమగు జీవన్ముక్తి సంప్రాప్తమగు చుండునని యూక్తిగా సర్వవేదశాస్త్ర పురాణములు బోధించుచున్నవని గ్రహించదగు పరమాత్మ అంతట వ్యాపించియున్నను జడములైన యింద్రియముల కగోచరుండు రాగద్వేష రహితమైనబుద్ధికి గోచరుండౌ నెట్లన సూర్యాది తేజస్సులంతట వ్యాపకమగుచున్నను అద్దము మొదలయిన పరిశుద్ధవస్తువులయందు దక్క నన్యపదార్థములలో ప్రతిఫలించవు గాన పరమాత్మ సుజ్ఞానతత్త్వపూర్ణోదయమందిన యాత్మకే గోచరుండని యెఱుంగనగు.

—[*] కందార్థము. [*]—

జలజదళమ్ముల జలముం । గలియని క్రియ దర్పణమున
గను తేజము వలె । గలియని దర్పణసామ్యము । తలకొను తమము
వనుయా॥ తత్త్వము చేరదన్నా ◆ నిత్యానంద ◆ క్రమము దేయ
న్నా॥ శమనియ్యమ గుణ్ణత్తి కన్దైవలో జేర్చి । సమగురిక దలాత్త
పాశిల వదాదరిన । ధమముముక్షును ధ్యాన మణిముణి దర్పణంబు
ను । బొల్చి దూడగ శమదమాదిక గుణకదంబను పొష్టువాంశ
ముపొందకను॥ తత్త్వము జేరదన్నా ◆ నిత్యానంద ◆ క్రమము
జేయన్నా॥ ·

క॥ గుఱు తెలుగుట జ్ఞానమునగా। మఱిమూలము లేని గుఱుతు మ
దిదెలసినదుం। జెరుగితనువు లేదనిన। ద్రిరాజ్యసుత షోడశా
క్షరీ మంత్రమగుగా॥

జ్ఞానపురుషుండు తాను తనమనస్సుచేతనే ఉద్ధరించుకోవలెను తనమనస్సే బంధువు శత్రువుగా నేర్పడును జితేంద్రితగా బొంది మోక్షార్హుండగుటకు స్థితప్రజ్ఞుండు గావలె మరణకాలంబున దేహయందు స్మరించుచు విడుచునో నారూపంబులు దాల్చ్యచుండును.

క॥ మరణము డాపగుచున్నది। పురచింతలు మానుమింక పూ
ర్తిగమదిను। స్థిరబుద్ధిని గీలించిన। స్మరణమె సర్వోత్తమం
బు నలువుముజీవా॥

క॥ ద్వారములు తొమ్మిదింటిలో। శూరుడవై దాలగసివక సు
లభముగానే। నారయ వాయువు బుట్టుము। ధరుడవై జ్ఞప్తి
నిలిపి హృదముగజీవా॥

క॥ దేహము విడిచెడువేళను। మోహమువిడి మనసునిలిపి ము
క్తికినరవా। సాహసహంసాక్షరజప। మూహనుమది నించి
బుంచ నొప్పునుజీవా॥

ఆత్మానాత్మ విచారణ.

శ్లో॥ ఆత్మచైతన్య మాశ్రిత్య దేహేంద్రియ మనోధియః।
స్వకీయార్థేషు వర్తంతే సూర్యాలోకం యథాజనం॥

అనగా సూర్య ప్రకాశమందున పనులు జరిగించుచుండునట్లు పరమాత్మ బలముచే యింద్రియములు తమతమపనులు

చేయుచున్నవి జ్ఞానము ఆత్మయగు పరమాత్మకేగాని జడము లగు యింద్రియ దేహాదులకు కాదు.

శ్లో॥ రాగచ్ఛా సుఖదుఃఖాది బుద్ధౌసత్యాం ప్రవర్తతే।
సుషుప్తౌ నాస్తితన్నాశే తస్మాద్బుద్ధేస్తు నాత్మనః॥

అనగా జాగ్రత్స్వప్నావస్థల యందు బుద్ధియుండును సుషుప్తి లో బుద్ధిలీనమగుచుండును కాబట్టి సుఖదుఃఖాదులు బుద్ధిధర్మ ము ఐ ఆత్మకులేవని తెలియనగును.

శ్లో॥ ప్రకాశోర్కస్యతోయస్య శైత్యమగ్నేర్యథోష్ణతా।
స్వభావ సచ్చిదానంద నిత్యనిర్మల తాత్మనః॥

అనగా సూర్యాదులకు ప్రకాశములెట్లు స్వాభావికములో అలాగే ఆత్మకు సచ్చిదానంద నిత్యనిర్మల స్వరూపముగా నుం డుట స్వాభావికముగా నెంచందగు ఆత్మయనగా శరీరత్రయ విల క్షణుండై అవస్థాత్రయ సాక్షియై పంచకోశ వ్యతిరిక్తుడై సచ్చి దానంద స్వరూపుడై కాలత్రయబాధ్యుడై యుండువాడేఆత్మ॥

౭॥ నైష్కృతము నాత్మకొందదు। వికృతేంద్రియ వర్గమాత్ర విష
యాములచే। ప్రకృతిని దగిలియునాత్మయు। సకృతుల భ్రాం
తిపబడును । జలఘటనభమై॥

మ॥ వినుమాత్మకుయింద్రియములు మనోవిజ్ఞానహంకారముల్।
తనువాకారములైన తత్త్వములుయీ తన్మాత్రలుల్। చిత్త
ముల్ అనువాదుల్ పరమాత్మనొందుజడమై। యుందంట
గారావు యాతనువుల్ కల్పితమైన తిరుణముల్ । తాన
చ్చుపాటియనే।

౪॥ దేవి దేహము యాత్మకు। వాహిగనై వదుచులోక వశ మునలినకే। భావంబు చారదెన్నడు। భావింపా పుణ్యమూ ర్తి బ్రహ్మముసుమ్మా॥

గీ॥ సత్యరూపియాత్మ సారాంశమీదేహి।
దానిచాలదేహ తత్త్వమనరె।
తత్త్వమూలగుట్టు తత్త్వమేపరమాత్మ।
శ్రీరనీరమొకటి జేరునగిది॥

౫॥ బాంతిగా దగిలిజీవుడు। శాంతియుగల అక్రురునకు సాధకుడ గునుం। కాంతివిశేషము గలరవి। కాంతాచూడంగవశమ కనుగొనవైనగా।

ఆత్మపరమాత్మ మేళనంబున జాగ్రంబులో సంభవంబై కర్తృత్వభోక్తృత్వ వ్యవహారి కత్వాంబులు చేయుచుండును ఆత్మయందు భిన్నత్వము విద్యాకల్పితములై దోచుచుండును గాని తత్త్వదృష్టిచేత దోచనేరదు వివేకముచేత అవివేకము తొలిగించిన ఆత్మయొక్కడై ప్రకాశించునట్లన మేఘావర్ణము తొలంగిన సూర్యుని ప్రకాశమువలె ఆత్మప్రకాశించును సర్వసాక్షిగానుండు పరబ్రహ్మమగు అనాత్మ అనేకకోటి బ్రహ్మాండము లుత్పత్తిస్థితి లయకారణములు పొందుచు వేరైదోచి లయమగుచుండుగాని పరమాత్మకంటె వేఱుగావు నీటియందలి బుగ్గలు నీటయందే పుట్టిపెరిగి నశింపుచు వేరుగాదోచినను మెట్లునీరగు చూడునో యట్లు ఆత్మానాత్మలు వేరుగావని దృఢచిత్తంబున నెఱుంగందగు మతభేదము లనేకములైనను జననమరణములు,

14

భేదములులేక మోక్షము ప్రధానమైనందున భక్తివిశ్వాస జ్ఞానంబున ఆత్మానాత్మల వివేరుగాభావించి నారాధించుట సగుణోపాసన యగును నిర్గుణోపాసన యందు అపరోక్షబ్రహ్మ సాక్షాత్కారము వడసి తన్మయులగు చుండుటయే ముఖ్యమైన అద్వైతభావము.

తే॥ జీవులెల్లను నొక్కండె సిద్ధమందు।
నొక్కరూపయ్యు బెక్కులై యునికివినరె।
నూలొకండయ్యు వర్ణముల్ నూటిగూడి।
బహువిధంబుగదోచు భంగివోలె॥

శ్లో॥ యథావిష్ణు మయంసత్యం యథావిష్ణు మయంజగత్।
యథావిష్ణు మయంసర్వం పాపం నాశయతేతథా॥

అధ్యాత్మయనగా నాశములేని పరమాత్మను పరబ్రహ్మమని చెప్పంబడు నాపరబ్రహ్మము అన్నిటనిండి యున్నందున అధ్యాత్మ యనంబడు నశించెడి దేహము లాదిభూతములని చెప్పంబడు ఆదిత్యాం తర్గతుండైన హిరణ్యగర్భుండు అదిదైవతమని చెప్పంబడు+ క్షేత్రజ్ఞుండనియును పేరుగలదు నాక్షేత్రజ్ఞుండు పాదము మొదలు శిరస్సుపరకు స్వభావికముగా జ్ఞానముచేత మెరుగబడు చున్నందున క్షేత్రజ్ఞుడనంబడు చిదాభాసుండనియును వాడుకగలదు నాచిదాభాసుడు నాత్మప్రతి బింభుడగుటచే దృశ్యపదార్థములను క్షేత్రమని పిలువంబడును అట్టిక్షేత్ర నివాసియగు పరమాత్మ క్షేత్రజ్ఞుండు +నాక్షేత్రజ్ఞుని యందు మాయాప్రతి బింబమును ప్రకృతియనంబడు నాప్రకృతియే

దేవాది ప్రపంచమంతా గుణములు బుట్టించి అనేకరూపము లై మరుగుచుండును యిట్టి మహాద్యమము సుజ్ఞానతత్త్వ పూర్ణోదయమందు తేటతెల్లం బగుచుండు ఆత్మయనగా పరిశుద్ధ బ్రహ్మతేజస్సు అనాత్మయనగా శుద్ధబ్రహ్మము.

నాపర బ్రహ్మమును తదేకధ్యానంబున స్మరించుచుండుట యె మోక్షసాధనము౹ు౨ర లక్షల జీవరాసులలో నీయిహలోక పరలోక జ్ఞాపకశక్తిగల వారలు త్తమ శరీరులు మోక్షార్హులు- పరలోకమెరుగక నీయిహలోక మెఱిగి వర్తించుచుండువారు మధ్యమశరీరులు నీయిహలోక మెరుంగనివారు అధమశరీరులు సుజ్ఞాతత్త్వపూర్ణోదయమంది గుణత్రయములలో సాత్వికులు దైవసంపత్తిగల వారలు రాజసులు లోక దేహవాసన లంటి నటించు చుండువారలు తామసులు రాక్షసవృత్తి గలవార లు కాబట్టి.

గీ॥ మనసులోన తెలిసి మనసులో నెకలిసి।
మనసులోనివాని మరలదిగిచి।
మనమునిలువువాడు పూర్ణజ్ఞ డగుయోగి।
విశ్వదాభిరామ వినరవేమా॥

గీ॥ అణువులోననుండు నఖిలజగంబులు।
నణువు తనదులోన నణగియుండు।
మనసునిలువు నరుడు మరిముక్తి జేరురా।
విశ్వదాభిరామ వినరవేమా॥

సదాశివునకన్న వేరొంకు లేదను నైక్యభావము సిద్ధాంతంబు యిట్లు భావించుట యెఱుగుటయే పరమార్థంబు వడయు సత్యంబు నీసత్యమును నెచ్చటజూచినను మరువకుండుటయే జ్యోతిర్మయంబు అట్టి జ్యోతిర్మయ బ్రహ్మతేజమందు నుండుటయే కైవల్యప్రాప్తి సాధనము ఘటాకాశంబు భిన్నమైనను అంతరిక్షము వేరుగాని చందంబున పరమాత్మ భిన్నుండై యనేకజీవుల యందుండినను భిన్నుండుగాడు సూర్యునికిరణములు నిబిడంబైన యంధకారము నశింపంజేయు చందంబున సదాశివాత్మక స్మరణంబువలన పాపంబులు నిర్మూలం బగుచుండు.

శ్లో॥ ఆత్మయోగ మనోచర్యో భక్తియోగ శిరోమణిః।
తంవందే పరమానందం నందనందన మీశ్వరం॥

శ్లో॥ యదేకం నిష్కళంబ్రహ్మ వ్యోమాతీతం నిరంజనం
అప్రతర్క్య మవిజ్ఞేయం వినాశోత్పత్తి వర్జితం॥

శ్లో॥ కారణం యోగనిర్ముక్తం హేతుసాధన వర్జితం।
హృదయాంబుజ మధ్యస్థం జ్ఞానజ్ఞేయ స్వరూపిణం॥

శ్లో॥ మనస్థంమనమధ్యస్థం మధ్యస్థమనవర్జితం।
మనసామనమాలోక్య స్వయంసిధ్యంతి యోగినః॥

గీ॥ పదపడి ద్రొక్కగ నేటికి।
గుడిలోపల గఠినశిలల గుణములుచెడునా।
గుడిదేహ మాత్మ దేవుడు।
చెడురాళ్లకు వట్టిపూజ సేతురువేమా॥

శ్లో॥ దేహో దేవాలయః ప్రోక్తో జీవో దేవ స్సనాతనః॥
త్యజేదజ్ఞాన నిర్మాల్యం సోహంభావేన పూజయేత్॥

మ॥ తనుహృద్భావల సఖ్యముల్ శ్రవణముల్ దాసత్వముల్।
వందనార్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయుల్।
సంకీర్తనల్ చింతనంబను నీతొమ్మిది భక్తిమార్గము లు।
సర్వాత్మున్ హరిన్నమ్మి సజ్జనుడై యుండుట భద్రమంచు
దలతుల్ సత్యంబు దైత్యోత్తమా॥

గీ॥ ఆత్మ దేహమందు అతిసూక్ష్మముగ జూచి।
దేహమాత్మ యందు తేటపరిచి।
ఆత్మ నెందుజూచు నతడెపో బ్రహ్మంబు।
విశ్వదాభిరామ వినర వేమా॥

గీ॥ మూడువేళలందు ముదముతో శివునాత్మ।
బూజసేయు వాడు పుణ్యమూర్తి।
పూజలేక బోగ మోక్షంబు దొరకునా।
విశ్వదాభిరామ వినర వేమా॥

క॥ తనపూర్వ కర్మవశమున। దనసుఖ దుఃఖములు రెండు దగి
లియె యుండుల్। ఘనులపద సేవ జేయక చనదెప్పుడు దుః
ఖసమితి చలచిత్తులకున్॥

కాబట్టి ఆత్మవిచారణ శ్రీగురు సాంప్రదాయకముగా
సుజ్ఞానతత్త్వ పూర్ణోదయమంది బ్రహ్మతన్మయమందుటే విదే
హ కైవల్యముగా గ్రహించందగు॥

క॥ భవనాశనంబును స్వపున। ర్భవరాహిత్యంబొసర్చి శాస్వత

సుఖమై। భవమొసగు హంసమంత్రం। బవిరళమహిమాఢ్య
మగుచు నంబుజవదనా॥

చ॥ పరమగు పంచకోశములవర్తనముల్ మరిదానిచిహ్నముల్।
పరువడి నాఱవస్థలును భావవిశేషము నందుయుక్తులున్।
గురుమతి జెప్పగావలసె కుంభినిలోపల యోగశాస్త్రత।
త్పరులగు బుద్ధిమంతులును తత్త్వవివేకముగలుగునటుగాన్॥

మ॥ కవితామార్గ మెఱింగినందులకు సత్కారంబుచింతించియూ।
సవిశేష స్థితిశాస్త్ర వాదములు చెప్పల్ జేసి తత్త్వార్థము।
ల్వివిధోపాయముతా గ్రహించుకొరకై వేదాంతమార్గం
బునే। భువిలోతేటతెనుంగు జేసెద జగత్పూజ్యంబుగా
వేడుకన్॥

రాజయోగ వివరము.

శ్లో॥ ప్రభవం దేవదేవేశం లోకానందం జగత్పతిం।
సర్వసాక్షిణం నమస్కృత్వా దేవివచనమాత్రవిత్॥

శ్లో॥ సచ్చిదానంద రూపాయ వ్యాపినే పరమాత్మనే।
నమః శ్రీగురు నాదాయ ప్రకాశానందమూర్తయే.

సంసార సాగర సముద్ధరమంత్రం బ్రహ్మాది దేవ మునిపూజితమంత్రం దారిద్రదుఃఖభవ రోగనాశనమంత్రం వందేమహాభయహారకం శ్రీగురు రాజమంత్రం.

శ్లో॥ పరిపక్వా మనోయేషాం కేవలోయంచసిద్ధిద॥
గురుదైవత భక్తానాం సర్వేషాం సుఖోజవాత్।

అనగా పరిపక్వ చిత్తులకు యీరాజయోగము సిద్ధించు గురుభక్తిగల వారికి విశేష సులభముగా సిద్ధించును.

ఉ। సాధన మేమి లేక భువి సాధ్యములంద సమర్థు లెవ్వరీ।
సాధనము ల్గ్రహింపగదుసన్మతి యుబ్బున వీనప్రజ్ఞచే। బో
ధయొనర్పజేయు గురి పొందిన భూతభవంబు లందునా। సా
ధకు లెల్లపుణ్యమును స్వాంతములోన గ్రహింతు రెవ్వరుల్॥

రాజయోగము త్రివిధములందు ౧ అజగరయోగి ౨ సంచారయోగి ౩ రాజయోగి మొదటి యజగరయోగి ఆత్మ అచలముగాను అంతః కరణములు నిశ్చలాబ్ధిగాను దేహేంద్రియాదులు చిత్రప్రతిమ వలెను నెంచి దృఢంబుగా బ్రహ్మసాక్షాత్కారుండై యుండును రెండవ సంచారయోగి ఆత్మను పిశాచమువలెను అంతః కరణములను మత్తుగాను దేహేంద్రియముల వశిబాలురవత్తుగాను బ్రహ్మసాక్షాత్కారుండై చరించుచుండును మూడవ రాజయోగి ఆత్మను వంధ్యాపుత్రుని రీతిగాను అంతః కరణముల భ్రమరకీటక న్యాయంబుగాను దేహేంద్రియముల కులాలకీటక సామ్యముగా నూచుకొని రాజులు మంత్రులు మొదలయిన భృత్యులు చేయు పనులను చూస్తూ సాక్షిగా నుండునట్లు దేహేంద్రియములు మనోబుద్ధులకు పరమాత్మ సాక్షిగా యుండునని దృఢసిద్ధిఁ బొందియుండు మూఢులు మేఘములు పరుగెత్తుచున్నప్పుడు చంద్రుడు పరుగెత్తుచున్నాడని యెంచు వల్లించక జీవబ్రహ్మైక్య భావంబునందు దృఢంబుగా తన్మయుండై యుండుటే సుజ్ఞానతత్వ పూర్ణోదయ భావమని యెఱుంగనగు.

శ్లో॥ మంత్రో లయో హఠో రాజయోగ చతుర్విధః।
రాజత్వా సర్వయోగానాం రాజయోగ ఇతిస్మృతిః॥

రాజయోగి యైనవాడు బ్రహ్మరాక్షసివలె వేదాంతవిద్య నుగ్రహించుటకు పట్టుబట్టి (విరాగస్య తృణంజగత్) అనునట్లు ప్రపంచంబును తృణప్రాయంబుగా నెంచి మనోన్మత్తుండై సంచరించుచు పిశాచాలుని వత్తుగా మాయామోహ భయభ్రాంతులు లేక సద్గురుకృప దీప్తస్వానుభవమువలన స్వయం పరిపూర్ణ బ్రహ్మము తానని సత్యజ్ఞాన దర్శంబులచే దప్పక బ్రహ్మమయుండై యుండును అట్టి రాజయోగి ప్రారబ్ధ కర్మఫలము దేహేంద్రియాదుల చేతనున్నా ఆగామి కర్మఫలము లోకుల చేతనున్నా అనుభవింపంబడి సంచిత కర్మఫలమును జ్ఞానాగ్ని చేత దగ్ధంబులై (కులాల కీటకవత్) అనగా కుమ్మర పురుగు బురద నుండినను యాపంకము దాని యంటనిరీతిగా బ్రహ్మానుభవంబున సంసారియై యుండినను రాజయోగి జన్మకర్మ ఫలంబుల నంటక యాత్మజ్ఞానముచే యిహపర సుఖంబులు కలందును యీశరీరముతోనే యనుభవించుట వలన పట్టు విడుపు లేని యీ రాజయోగము వలన సహజానందుండై సశరీరుండైనను అశరీరుండై విదేహముక్తి ప్రాప్తుండై విదేహకైవల్యానుభవశీలుండై ప్రకాశించుచుండును.

క॥ నేవసిప వన్నుమార్గుడు। మేనని వీక్షించుచుగాన మేల్కనిస
త్య। జ్ఞానానంద మయునిగా। జ్ఞానముచే నెఱుగవలయు
పన్గుంతశాలీ॥

## అక్షరపరబ్రహ్మ వివరము.

శ్లో॥ నిర్గుణో నిష్క్రియోనిత్యో నిర్వికల్ప నిరంజనః।
నిర్వికారో నిరాకారో నిత్యముక్తోస్మి నిర్మలః॥

అనగా అవిద్యా రహితుడు నిష్క్రియుడు నిత్యుడు నిర్వికల్పుడు నిరంజనుడు నిర్వికారుడు నిరాకారుడు నిత్యముక్తుడు నిర్మలుడుగా నెఱుంగందగు.

శ్లో॥ అహమాకాశ వత్సర్వం బహిరంత రతోచ్యుతః।
సదాసర్వ సమశ్శుద్ధో నిస్సంగో నిర్మలోచలః॥

అనగా ప్రపంచమునంతయు నిండి యున్నాను నేనే సర్వమును సంపూర్ణుండై నిండెదనని గురుముఖంబున సుజ్ఞానతత్వ పరిపూర్ణోదయుండని యెఱుంగనగు.

శ్లో॥ నిత్యశుద్ధవిముక్తైక మఖండా నందమద్వయం।
సత్యంజ్ఞానమనంతంయత్ పరం బ్రహ్మాహమేవతత్॥

అనగా రెండవది లేని పరబ్రహ్మస్వరూప చిన్మయానందఘన మే నేనని యెఱుంగుచుండుటే జీవన్ముక్తిగా గ్రహించి నిర్భయుండై యుండుట సహస్రదళపద్మకర్ణికకుహరాంతరమందు కుండలీమధ్యమమున పరబ్రహ్మమును జూచుచుండుటయే పరమకుండలియనం బరగునదియె జీవాత్మ అంతరాత్మ పరమాత్మ నిర్మలాత్మ శుద్ధాత్మ మహాత్మ భూతాత్మ యని యెనిమిది పేర్లచే నుచ్ఛరింపం బడును వాసనాత్రయములను దాటియున్న వస్తువే పరమాత్మయగును.

౧ లోకవాసన లోకులు స్తోత్రము చేయవలెనని వాంఛించుట లోకవాసన యగును.

౨ తీర్థదీంతన ప్రాణాయామాది యోగములు శరీరము శక్తము మాంసము మాయాసమ్బంధములు గనుక జీవుడు నిర్మలాత్మయగుట గ్రహించుకే దేహవాసన.

3 శాస్త్రముచదివి శాస్త్రపద్ధతిని నడుచుటకుయత్నించుట చదివి పరులనోడించినను తానువోడినను ప్రయోజనము లేదు.

—[*] కందార్థము. [*]—

అక్షరప్రణవాకారము । రక్షకమని యెఱిగిమఱిగి రావము పైగా। నిక్షేపమైన బ్రహ్మము । కుక్షింభరు లెఱుగరెవ్వరు॥ కుటిలాచారులునై ♦ శంబరశక్తి ♦ జటిలాధారులునై ॥ నిటలమందుచూట్కి । నిక్కించిపాపల చటులచిత్కళలంటి। చర్చించిగనలేరు పటుతరంబగు బట్టబయలున। గ్రాకిమెలగెడు తావెఱుంగక దిటవుగానా బ్రహ్మతన్మయు। దివ్యతేజము పొందజాలరు॥ కుటిలలాచారులునై ♦ శంబరశక్తి ♦ జటిలాధారులునై॥

—[*] కందార్థము. [*]—

లక్ష్యములో వెలిదాకెడు । లక్ష్యమెగురి బయలుదాకు లాఘవమరయా । లక్ష్యంబగు చిద్రూపవి । లక్ష్యములో నిత్యసుఖము॥ లాగియుందుమురా ♦ విజ్ఞానుండా♦ వేగపొందుమురా॥ రాగద్వేషములను రాపాడిలోబించి । యోగమార్గములంది యానందమయుమగు। తూగుటుయ్యాల జేరినిద్రను తువ్వటిల్లగ తుఱగలించుము । భాగరై ప్రత్యక్షపరశివ బ్రహ్మ

లస్మరయ తత్త్వమతిమతి॥ లాగియందుమురా॥ విజ్ఞానండై॥ వేగపొందుమురా॥

౪॥ పొలువగు సర్వవిలక్షణ। ములచేనాద్యంతశూన్య మువని శ్చలతన్। మెలగినతన్మయ తత్త్వము। దలపోయశరా గ్నిమధ్య తపమదిజీవా॥

౪। అక్షరచతురాక్షరిపై। నక్షరతత్త్వంబునెఱిగి యంత్యము నందా। ద్యక్షబ్రహ్మము గదసిన। తక్షణమున నిత్యపద వి తనరునుజీవా॥

౪। ఘటనిటలాంతుశభావ। స్ఫుటితరమాజ్ఞప్తినంటి సూక్ష్మ మున్నివై। పటుతరలక్ష్యాం తర్గత। నటనంబగు నచలదీప్తి నంటుముజీవా॥

—[*] కం దా ర్థ ము. [*]—

సాధ్యాసాధ్యముగానిది। బోధ్యాభేద్యంబుగాదు బొం దనచలముఙ్। రాధ్యారాధిత బ్రహ్మము। బాధ్యాభాద్యంబు గాని॥ పరిపూర్ణమయ్యా॥ రజ్జనమాని॥ గురిగనుమయ్యా॥ అన మరతేకను యంతర్జ్యోతినంటి పరిపూర్తినొందుట ప్రజ్ఞానంబ్ర హ్మము। నిరాలంబము నిర్వికల్పము నిరతిశయ మానందమచ లము। పరాపరమగు బట్టబయలున ప్రకాశముఘా గమకించి బొందుట॥ పరిపూర్ణమయ్య॥ రజ్జనమాని॥ గురిగనుమయ్యా॥ చ॥ అరయచరా చరాదులగునట్టి శరీరములందు చిహ్నముల్। బరగనెఱింగి శాస్త్రముల పద్ధతిదప్పక వారియంతరాం।

తరములుజెప్పగావలసె ధర్మమునర్థము కామమోక్షముల్।
నిరుపమసాధుమార్గమున నేర్పుగులందగ జూచిమెచ్చగా॥

మహావాక్యోప దేశవివరము.

శ్లో॥ వాచాతీతం మనోతీతం భావాతీతం చతత్పదం।
జ్ఞానాతీతం గుణాతీతం భజామిగురుమద్వయం॥

శ్లో॥ సమ్యగ్విజ్ఞానవాన్యోగి స్వాత్మన్యేవాఖిలంజగత్।
ఏకంచ సర్వమాత్మాన మీక్షతే జ్ఞానచక్షుషా॥

అనగా ఆత్మసాక్షాత్కారము కలిగినయోగి జ్ఞానదృష్టిచేత సమస్తజగత్తును తనయందును సమస్తజగత్తు తానైచూచుచున్నాడు.

శ్లో॥ జీవన్ముక్తిస్తుతద్విద్వాన్ పూర్వోపాధిగుణాంస్త్యజేత్।
వసచ్చిదాదిధర్మత్వా ద్భజే భ్రమరకీటవత్॥

అనగా అజ్ఞానస్థూలసూక్ష్మ శరీరములు సత్త్వాదిగుణములు పరిత్యజించి బ్రహ్మానంద మగ్నుండై యుండుటే జీవన్ముక్తి భ్రమరకీటక న్యాయముగా సాక్షాద్బ్రహ్మత్వమునే బొందియుండును.

శ్లో॥ జగద్విలక్షణం బ్రహ్మ బ్రహ్మణోన్యన్న కించన।
బ్రహ్మన్యద్భాతి చేన్మిథ్యా యథా మరుమరీచికా॥

అనగా ఆత్మజగత్తు లక్షణముగలదికాదు జగత్తుకంటెవేరైనది ఆత్మకంటె వేరైనదేదియునులేదు ఒకవేళ ఆత్మాతిరిక్తముగా జగత్తువున్నట్టుదోచిన నదియెండమావులవలె అబద్ధమని తెలింగి బ్రహ్మమేతానని నిర్గుణానంద సుజ్ఞానతత్త్వపూర్ణోదయమందందగు.

స్వయంప్రకాశా ద్వితీయాఖండ మార్తాండ స్వరూపుండై ప్రవర్తించుచున్న జ్ఞానారూఢుండగు విద్వద్విష్ఠుండు పొందుచుండును.

శ్లో॥ యదానందరూపం ప్రకాశస్వరూపం । నిరస్తప్రపంచం
పరిచ్ఛేదశూన్యం। అహంబ్రహ్మ వృత్త్యైకగమ్యం తురీ
యంపరబ్రహ్మ నిత్యం తదేవాహమస్మి॥

యని పరిపూర్ణుండై నిర్గుణుండై సదానందుండై నిరంజనుండై (కూటస్థమచలంధృవం) బనున్యాయముగా (ఏకమేవాద్వితీయంబ్రహ్మ) (అఖండానందాద్వయంబ్రహ్మ) (ఆకాశశరీరం బ్రహ్మ) (నిశ్శబ్దో బ్రహ్మఉచ్యతే) (ఓంఇత్యేకాక్షరంబ్రహ్మ) ప్రజ్ఞానంబ్రహ్మ (అహంబ్రహ్మాస్మి) (అయమాత్మా బ్రహ్మ) (తత్త్వమసి) యనువాక్యములు బ్రహ్మమును దృఢముగా బోధించుచున్నవి పై వాక్యముల ననుసరించి (శివోహం) (శివోహం) బనుభావాను భవంబునొంది స్వయంప్రకాశమును పొందుచుండెదరు పాలనుండి సంగ్రహించిన వెన్నచల్లలో గలియనియట్లు జీవుడన్ని వికారములుపొందినా (ఆనందబ్రాహ్మణో విద్వాన్) యనువట్లు బ్రహ్మేను భవమందుచుండును యిట్టిమహా వాక్యములలో ఋగ్వేదములోని (ప్రజ్ఞానంబ్రహ్మ) మను సాక్షాత్కారములో బ్రహ్మము నందజాలక యజుర్వేదములోని (అహంబ్రహ్మాస్మి) యనిదెలిపియున్నను చక్కగా దృఢపడక సామవేదములోని (తత్త్వమసి) యనిదెలిపినను సందేహముడిపక (అధర్వణ వేదములోని అయమాత్మా బ్రహ్మ)

మనుస్వానుభవ సుజ్ఞానతత్త్వపూర్ణోదయ మొందించుటకై పై నాలుగు వేదములలోని నాలుగు మహావాక్యములు ఘోషిం చుచున్నవి అందు మొదటి ఋగ్వేదములోని మహావాక్యవివర ము (ప్రజ్ఞానం బ్రహ్మ) మను రెండుపదములు విచారించగా ప్రజ్ఞానంబను చిదాభాసుండైన జీవుండు సకలదృశ్యములను యేజ్ఞానముచే కానుగబడునో నాజ్ఞానము ప్రజ్ఞానమగును బ్రహ్మమనగా సకలమునందు కలిసియున్న వస్తువనబ బ్రహ్మ మని లక్ష్యార్థము బ్రహ్మము మొదలు సకలచరా చరములు జంతుజాలంబులయందు వెలుగుచున్నదని వాచ్యార్థము వాచ్యా ర్థముఖు తోసివేసినచో పరబ్రహ్మ స్వరూపమే ప్రజ్ఞానమనెడి చైతన్యము అదియే బ్రహ్మస్వరూపమనియు ఆత్మస్వరూపమ నియు పరమాత్మయనియు వొక్కవస్తువనబ అనేకపేర్లుగలిగి నవి ఇట్టిజ్ఞానోదయ మందుటే నేనుబ్రహ్మమను నిశ్చయము లక్ష్యార్థము బ్రహ్మమును వేరుగానెంచుచుండుట వాచ్యార్థము.

రెండవ యజుర్వేదములోని మహావాక్య వివరము (అహం బ్రహ్మ అస్మి) యను మూడుపదములను విచారించగా అహ మను చైతన్య నిర్వికారము అహమనే చాలదు అహంకారము జడముగనుక అహమనచాలదు పరమాత్మ స్వరూపమైన చైత న్యమే అహంకారముతోగూడి అహమని స్ఫురింపుచున్నది బ్ర హ్మపదమునకు తనకుకాక అన్నిటానిండి పరిపూర్ణమై బుద్ధిక సాక్షియై యుండునదియే బ్రహ్మము అట్టిబ్రహ్మము బుద్ధికిసా క్షియై యుండుటంబట్టి అస్మికి ఐక్యమును ప్రతిపాదించుచున్నది

కాబట్టి బ్రహ్మమైయుంటివని నిశ్చయించుకొనుట మూడవ సామవేదములోని మహావాక్య వివరము (తత్ త్వమసి అసి) యను మూడుపదములను విచారించగా తత్పదము సర్వజ్ఞాది గుణములు గూడినదని వాచ్యార్థము అన్నిటికి విలక్షణుడనై సత్యజ్ఞానానంద నిత్యనిరామయ నిర్మలత్వముగల పరమాత్మయని లక్ష్యార్థము త్వంపదమనగా అవిద్యయందు ప్రతిఫలించిన బ్రహ్మఛాయా స్వరూపుడగు జీవుండని వాచ్యార్థము అభిమానముగల విశ్వతైజసనామములు కించిజ్ఞత్వాది గుణములును గూడినదనుట లక్ష్యార్థము అశిపదమనగా వుభయవాక్యార్థములు వేర్వేరై సమకూడదుగాన రెంటికి నైక్యమును ప్రతిపాధించుచున్నది తత్ అనుశబ్దము బ్రహ్మము త్వంఅనుశబ్దము జీవుడు అశియనుశబ్దము రెంటికిని ఐక్యమును బోధించుచున్నది హంసశబ్దములో హకారము తత్పదమున్ను సకారము త్వంపదము రెంటిని నైక్యముజేయుటయే బ్రహ్మత్వమని అశిపదము ప్రతిభాదించుచున్నది నాల్గవ అధర్వణ వేదములోని మహావాక్యవివరము (అహం ఆత్మా బ్రహ్మ) మనుమూడు పదములను విచారించగా అహం అనగా సర్వముబ్రహ్మమని లక్ష్యార్థము బ్రహ్మమే స్వప్రకాశమైన ఆత్మ ఆయాత్మ స్వరూపమే నీవు అనిమహావాక్యములు బోధించుచున్నవట్టి అఖండైక రసమైన సుఖ స్వరూపముగానుండు ఆత్మయే నీవు నీవే ఆపరబ్రహ్మమని బోధించెడు వాక్యములున్ను గురూక్తియించెడి యోగానందమున్ను పొందియున్న మహాపురుషులకే పరబ్రహ్మానంద సు

ధుము గోచరించుచుండుగాని యితరుల కగోచరమై యుండును.

శ్లో॥ అయమాత్మాగి బ్రహ్మైవ సర్వాత్మకతయాస్థితిః।
ఇతినిర్ధారితంశ్రుత్యా బృహదారణ్య వక్త్రయా॥

అనగా బ్రహ్మస్వరూపమే ప్రపంచరూపతత్త్వమై యున్నదని బృహదారణ్యశ్రుతిచేత స్థిరంబుగా నిర్ధారణచేయ బడి యున్నది.

క॥ అజ్ఞానవృత్తినణచిన। సుజ్ఞానపమగ్రుడగును సువిచారుండా।
ప్రజ్ఞానం బ్రహ్మమనెడు। విజ్ఞానమహావదవి వినుమిక జీవా॥

క॥ తత్పదమొప్పను యుంగము। చిత్పదత్వంపదము లింగ జీవా
కృతియా। తత్పదత్వం పదమశిపద। ముత్పత్తివిరహితమార్గ మొప్పనుజీవా॥

క॥ అయమాత్మ బ్రహ్మమందురు। అయమన నాత్మయన భేదమమరెను పెల్లై। అయమాత్మైక్యము బ్రహ్మము। నియమాత్మునకు నిత్యోదరయ నిజముగ జీవా॥

క॥ అహమస్మి బ్రహ్మాస్మియన। అహమెట్టిది బ్రహ్మమెట్టి దస్మి యెల్లమరు। ఇహమందా త్మైక్యముగను। సహజముసు ఫలించుచుమిండు సంయమిజీవా॥

—[*] కందార్థము. [*]—

చింతలులేకను బయలున। సుంతైనను చూట్కనిలిపి సూక్ష్మాత్మక్యమై। కొంతశిదవెంచిజూచిన। వింతలుచే టొందు బయలే విలశితాకాశ ॥ అహమస్మితి ॥ నిలయప్రకాశం॥ పలు

గాఢజ్ఞప్తిలో బ్రత్యక్షమందెదు। తలపుమన్మతములాని దన రారజేయును। నిలయమగునజ్ఞానబంధుర వీతకలయిక పూర్ణ తత్త్వము। నెలవెలుంగున నివ్వటిల్లెడు నిర్మలంబగుబట్టబయలె॥ నిలశితాకాశం॥ అహమస్మితి॥ నిలయప్రకాశం॥

—[*] కందార్థము. [*]—

పొందగుమది తత్పదమునన। త్వంపదమన బ్రహ్మమగును తలకొనిచూడగ। యింపుగ రెంటికి నైక్యము। సొంపుగ తన్మయ తచెంది॥ సోహమెన్నుమురా॥ నిత్యోహమందే॥ పోహణగదరా॥ కాకోటముగదృష్టి బ్రతిఘటింపబూని। సాహసంబున మించి సంతోషగమందును। దేహిదేహము శాశ్వతంబను। తెగులుతోద్పడి జచ్చిపుట్టును। మోహరించియు పూర్ణమందుట మోక్షమార్గము బట్టబయలగు॥ సోహమెన్నుమురా॥ నిత్యోహమందే॥ పోహణగదరా॥

శివజీవైక్య సంధాన వివరము.

శ్లో॥ ఏవమాత్మా రణాధ్యాన మధనేన తతంకృతే।
ఉదితావగతేజ్జ్వాలా సర్వాజ్ఞానేంధనందహేత్॥

అనగా ఎల్లప్పుడును సుజ్ఞానతత్త్వపూర్ణోదయాంతర్గతము నందు బ్రహ్మమును జీవుని యేకత్వభావముగానెంచి మైమరచుచుండుటయే శివజీవేశ్వరైక్య సంధానము సుజ్ఞానోదయ పూర్ణమను అగ్నియందు అవిద్యయనెడు ఇంధనము నిశ్శేషముగా భస్మమైనట్లు శివజీవులు సమాధియందు యేకమగుచుండుటయే శివజీవైక్య సంధానము.

శ్లో॥ స్థాణౌ పురుషవద్భ్రాంత్యా కృతా బ్రహ్మణి జీవతా।
జీవస్య తాత్త్వికే రూపే తస్మిన్ దృష్టే నివర్తతే॥

అనగా అంధకారమందు నిలచియుండు చెట్టు మోడు చూచి పురుషుడని భ్రాంతితో చెడులాగున అద్వితీయ బ్రహ్మమునందు జీవునికి భ్రాంతిదోషమను గురుశాస్త్రజ్ఞానముచే కల్పితమని తెలిసిన జీవత్వముపోయి బ్రహ్మత్వము సిద్ధించుచుండుటయే శివజీవేశ్వరైక్య సంధానము.

శ్లో॥ తత్త్వస్వరూపానుభవాదుత్పన్నం జ్ఞానమంజసా।
అహంమమేతిచాజ్ఞానం బాధతే దిగ్భ్రమాదివత్॥

అనగా జీవేశ్వరైక్య సంధానమువలన నేనునాదియను అజ్ఞానమునంగును సూర్యోదయమై అజ్ఞానమను అంధకారమడంచినట్లు శివజీవైక్య సంధాన జ్ఞానమమరు.

మ॥ శివజీవైక్యసమాధినుండు విలసచ్ఛిన్మాత్ర తత్త్వంబుదా।
నవలీలంగల పూర్ణుడై సిదప మాయాసంస్మృతిం జెందినం।
దవులన్నర్పునె యోగి పాలుపిదుగై ద్రవ్యంగ పేతైనయా।
నవనీతంబికి జల్లలో గలయునే నానా ప్రకారంబులన్॥

శా॥ వైరాగ్యంబు దృఢంబు జేసి తత్త్వజ్ఞానవమార్గించిన।
ర్వారంభో పరమంబుగై కొని తురీయుంబందియా రీతి తో।
గారూఢుండగు వానికిం గలుగు నేయాగామి యున్నంచిలి।
ప్రారబ్ధంబులు సంతతంబు బరబ్రహ్మత్మునై యుండగా॥

శ్లో॥ మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః॥

అనగా సర్వజీవులున్నూ పరమాత్మస్వరూపమే యగుటం

చేసి ప్రత్యగ్బ్రహ్మలకు అనాదినుంచి యేకత్వము స్వతస్సిద్ధమై యున్నది.

—[*] కందార్థము. [*]—

నీరునక్షారము బుట్టును। క్షారమునీరందుగలసి క్షయ మొందుసుధీ। యారీతిశివునిజీవుని। చేరికెయగు గుట్టుదెలసి॥ చిట్టాడవలెరా ♦ నియమాత్ముడవై ♦ ముట్టగనగురా॥ యిట్టట్టుచూడక నీవునిగమకించి యెట్టకేలకైన యేకత్వమెమరెను। గుట్టునీమది ముట్టునుండెడి కుంభకములోబయలుజేరుట। నిట్టనిలువగు తన్మయత్వము సిద్ధకాగ సముద్రమలవడ॥ చిట్టాడవలెరా ♦ నియమాత్ముడవై ♦ ముట్టగనగురా॥

నిరావరణస్థాన బట్టబయలున రవికోటి ప్రకాశలబ్ధ విజితాత్ముండై విశ్రుతగుణ పరిపూర్ణుండై షట్కమల ప్రకాశుండై వాచామగోచరుండై సత్యజ్ఞాన మనంతబ్రహ్మమైన జీవన్ముక్తికిని సాధించుటయే శివజీవైక్యభావము అట్టినిష్కళంక భావము ప్రత్యక్షముగా హృదయాంగణమునందు ధ్యానించుచుండు ప్రాజ్ఞునకు విధి నిషేధాదులు లేవు ప్రపంచాతీత మయిన పరబ్రహ్మము శూన్యముకాదు అపరోక్షానుభవ మంతవరకు కలిదియగునో అంతవరకు లింగదేహముతో ప్రాణము పోవుచు వచ్చుచుండును అజపా మంత్రాత్మకము ౨౧౬౦౦ వుచ్ఛ్వాస నిశ్వాసలచేత నాకాశతత్త్వములో వెలిగానంచరించుచుండుటంబట్టి నిరంజనుడని పేరందెను అట్టిఆకాశము శబ్దగుణకము నిరంజనుడు శబ్దగమ్యుడు అట్టి నిశ్శబ్దమెంతవరకు అపరోక్షా

నుభవ మందదో అంతవరకు గురుశాస్త్ర వేదయుక్తులచేత నిం ద్రియనిగ్రహ మలవడునట్లు సమాధిలో సాధించి సాధనకర్మా నుష్ఠానములను ఫలాపేక్షలు లేక చేయుచు కర్మలత్యజించి శివ జీవైక్య సాధనము దుర్లభమైనను సాధించి పొందుచుండందగు అట్టి ఐక్యమంత్యకాలము ప్రాప్తించిన బ్రహ్మైక్యమునొంది జీవ న్ముక్తి లభించును.

అనంతరాధుండై అర్చిరాదిమార్గమున బోయినవారికి పున రావృత్తి గలదని పెద్దలు వక్కాణించి యున్నారు.

—[*] కం దా ర్థ ము. [*]—

జీవేశ్వర రూపంబులు। భావములో నిలిపిచూచి పరిచ ర్యుడనై। సేవించుచుండునాత్మది। గావించునుమనసు బయలు॥ గనిమెలగుమయ్యా। సంతోషసం। తనగలుగునయ్యా॥ కనుపాప లక్ష్యించి కాంతిలోగమకించి। మననముందుమీవు మార్కొని కాంతులకను। సనాతనముగు బ్రహ్మకళలటు। సమరసంబున దా టియుచ్చరి వనితయగునా। ముక్తికాంతను వలచియుపరతి జేసి పొక్కు। గనిమెలగుమయ్యా। సంతోషసం। తనగలుగునయ్యా।

అట్టి యణిమాది యోగసిద్ధిని గోరనియారూఢజ్ఞానికి నా మరూపాత్మక జగత్తులు కనుపడుచున్నను నిష్కళంకముగా ఆకాశము చూచుచుండినను బ్రహ్మనిష్ఠయందు నిరాకరించి హంసరూపమై శివజీవైక్యమును పొందుచుండెడి స్థైర్యత్వము చే జననమరణములనే సుఖదుఃఖములను సప్తార్చి కర్పించి భ స్మంబు జేసుకొని విద్వాంసుండై నిర్మలమైన అద్దమునందు తన

తేదమైన రూపును గనుచుండు చందంబున పరబ్రహ్మ స్వరూప
మైన శివునియందు జీవుండై నతాను తన్మయుండై యుండు.

శ్లో॥ కైవల్యం కేవలంశాంతం శుద్ధమత్యంత నిర్మలం।
నిర్గుణం పరమంజ్యోతి రప్రమేయ మనుత్తమం।
ఆద్యంతరహితం సూక్ష్మం శివమద్వైత మవ్యయః॥
యత్జ్ఞాత్వాముక్తి మాగచ్ఛేత్ జ్ఞానంబ్రూహి కేశవా॥

శ్లో॥ తిలమధ్యే యథాతైలం క్షీరమధ్యే యథాఘృతం।
పుష్పమధ్యే యథాగంధం ఫలమధ్యే యథారసః॥

అనగా పరమాత్మమాయా సమేతుండై యన్నిటనిండియున్న
వాడుగాన పరమాత్మయందు రజ్జుసర్పభ్రాంతి తెరంగున ఆకా
శము మొదలు అండాండములు పిండాండములు బ్రహ్మాండము
లు తానతానై తోచిరాక యతీతుండై నిర్భయుడై యున్న ర
హస్యము పరమగురు శ్రీకృపవలన ఆత్మానుభవముం దెడువారి
కే గోచరించును మూఢులకుపరమాత్మరహస్య ములవడుట దు
ర్లభముగాన సుజ్ఞానతత్త్వ పూర్ణోదయప్రాప్తిం జెందియున్న
మహాత్ములకు పరమాత్మయందు అహమతియుంచుటే సర్వవ్యా
ప్తై వెలుంగుచున్న సత్యము (త్వమహం)(తత్వసి) (త్వమద్వైక్యా)
యిట్లుపకత్వము ప్రతిపాదించు చుండును వింతకన్న నేమియు
యుండనేరదు యిట్టిసుజ్ఞానములో ఆకాశము నెచ్చట జూచిన
ను యథావిధిగా నన్నట్లు శివుండు నెుచటజూచినను తానతా
నై ప్రకాశించుచున్నాడు యిట్టియనుభవ రహస్యముందినయో
గి ఆత్మారణిలో ప్రణవంబును నుత్తరారణిగాజేసి స్వరూపసా

వసనువలను అగ్నిహోత్రముననే సుజ్ఞానమును కల్పించి నిరా కారిణైయ సదాశివకైవల్య సంధానుండై సర్వంబును బునము విడిచినట్టి దేహభ్రాంతినిమరచి సదాగురుధ్యాన పారాయణుండై సదానందుండై యుండు నట్టి సుజ్ఞానతత్త్వ పూర్ణోదయ జ్ఞానరత్నమును చేకొను యోగి పుంగవుండు మేఘావర్తములో లంగిన పిమ్మట సూర్యుని తేజముంవలె జీవన్ముక్తుడై ప్రకాశించును అట్టియనుభవమే నిత్యానంద బ్రహ్మపదవియనిన్ని సత్యజ్ఞానానంద బ్రహ్మపదవియనిన్ని నిత్యానందమయంబ్రహ్మ పదవియనిన్ని (ఏకమేవాద్వితీయం బ్రహ్మపదవియనిన్ని) (అనంత దివ్యసంకాశం బ్రహ్మపదవియనిన్ని) (ఆకాశశరీరం బ్రహ్మపదవియనిన్ని) సర్వంఖల్విద బ్రహ్మపదవియనిన్ని) (ఓమిత్యేకాక్షరం బ్రహ్మపదవియనిన్ని) యీపుత్రుంట్టుబయ లేమిలేదను బ్రహ్మద్వాదశాక్షరి పదవియనిన్ని యీమూలములేని గుర్తైనశరీరమేమిలేదను షోడశాక్షరి బ్రహ్మపదవియనిన్ని కలదోచిన శరీరములేలాగో అలాగయను పంచదశీ బ్రహ్మపదవియనిన్ని మంత్రబీజములను లోకోపకారార్థముగా వేదశాస్త్రపురాణాగమములలో ఘోషించుటను గురుస్వాములశిష్యులకు బోధించి కృతార్థుల చేయుచున్నారని గ్రహించందగు యిదియే శివజీవేశ్వరైక్య జీవన్ముక్తిగా నెఱుంగవగు.

ఎఱుక సంగ్రహము.

శ్లో॥ పరేశంపార్వతీకాంతం రమాధీశం దిగంబరమ్।
నిష్కలో నిత్యతృప్తాత్మా నిత్యానందో మహేశ్వరః॥

శ్లో॥ నమస్తే దేవ దేవేశ సర్వవ్యాపినిరంజన।
సత్వాదిగుణభేదేన లోకవ్యాపార కారణ॥

శ్లో॥ నమస్తే బహురూపాయ అరూపాయ నమోనమః।
సర్వైకాద్భుతరూపాయ నిర్గుణాత్మగుణాత్మనే॥

క॥ ఎఱుకందు బుట్టుసర్వము। ఎఱుకందే వృద్ధిబొందు ఎఱుకం
దణగక। ఎఱుకయె మూలము బ్రహ్మము। ఎఱుకను విడ
నాడి బ్రహ్మమెఱయుట భువిలోక॥

సీ॥ కల్పనలకు మూలమై ప్రాలు నెఱుక।
కల్పితాంగంబులెల్ల వికల్పముగను।
కల్పములకాదియై బ్రహ్మ కల్పమందు।
నల్పమైదాగు నచ్చోట నదియెపరము॥

—[*] కం దా ర్థ ము. [*]—

ఎఱుకకు మూలము లేకను। మఱిపించును పెరిగితఱిగి
మాయలకిరవై। ధరనింద్ర జాలసమమై। దురితంబుల బొంద
జేయు॥ తుదముట్టనివదు । నిర్మలభక్తి । మదినంటనివదు॥ కుది
రికతోడను కుహరమధ్యమాఱెరి। గుదికొనిగుర్తించి గూఢమె
న్నుచునుండు। పదిలముగ నానిర్వికల్పము బడయుకుండెదు
ప్రోవజూపుచు। మొదలు చుండును హృదయకమలవు। మేశ
నంబున భ్రమలకిరవై॥ తుదముట్టనివదు । నిర్మలభక్తి । మ
దినంటనివదు॥

క॥ పనిబూని ఎఱుకమున్నై। అనయము నాదాంశమునను వ

నస్యూతంబై । వినిగని క్షిప్తికిసుదై । మనుచుండునుదయం
తరాత్మ మెఱుగునజీవా॥

సమాధియందు ఎఱుకవలన నింద్రజాలము భంగి మాయ లుగల్పింపంబడి బుద్ధిని జెరచుచుండును కాబట్టిబుద్ధిని మనసం బున నొక్కబట్టి తన్మయమందు చుండుటయే బ్రహ్మానందము.

—[*] కందార్థము. [*]—

మొదటను దోచిన దెఱుకయె । తుదజూడగ లేనిదెఱు కె తూలని దెఱుకే। పదపడి పూర్ణసమాధిని। యిదియదియని భావమున। నెంచినదెఱుకే ; మోహాటవి ద్రుంచినదెఱుకే॥ సంచితాదికర్మ సంగతములనెల్ల । వంచితంబుగజూపి యాడిం చుచుండును । కొంచమైనను చాలు విశకను కదుపుచుండును। కల్పితంబుల నెంచకను బయలంటిస్వరము । నెఱయ మఱ చిన నిత్యసుఖమని। ఎంచినదెఱుకే ; మోహాటవి ; ద్రుంచిన దెఱుకే।

సుఖాసీనుండై కూర్చుండి లోకమును జూచుటకు నుద్దే శించి జూచునది చక్షువు కానులేక చక్షువుచూడం జాలదు కాను చక్షు సహాయంబున జూచి గ్రహించునది మనస్సు ఆ మనస్సె తెలివియనియు జ్ఞానమనియు మాయ ఎఱుకయనియు గ్రహించి సమాధియందు గల్పితంబులై ప్రకాశించెడి వృత్తుల న్నియు నెఱుకచే గల్పితంబులని దృఢంబుగా నెఱింగి బ్రహ్మ సాక్షాత్కారమును బొందునప్పుడు గలుగుచుండు చిచ్ఛలో నెఱుక లయమొందు చుండుటయే కైవల్యము ముక్తి అనం

దము కాబట్టి పూర్ణసమాధియందు నిర్మలచిత్తుండై మించుటకును పరమగురూక్తిసిద్ధించుటకును చేయుచుండు ప్రయత్నమే బ్రహ్మానంద సాంబ్రాజ్యపదవికి మూలాధారమని నెఱుంగనగు.

—[*] కందార్థము. [*]—

ఎఱుకనె పూర్ణము జూపును । పరిపూర్ణము నెఱుగరాని బయలై యుండున్। ఎఱుక పరిపూర్ణమందున । నిఱుముచు తానందుజనునో॥ నిదిచిత్రమయ్యా॥ మాయలుబన్ని॥ మదిశెరచునయ్యా॥ గుదికొనిసంకల్ప గుణములద్రుంచగ। మదిదోచునాబ్రహ్మ మన్మయపురిలోన । చెదరకనుగుఱి నిలుపుమచ్చట చిత్స్వరూపము బట్టబయలగు। సదయహృదయ సమాధగాంబున సంస్మృతంబగు బ్రహ్మకళగను॥ టిదిచిత్రమయ్యా॥ మాయలుబన్ని॥ మదిశెరచునయ్యా॥

గీ॥ జాతులందు నెట్టి జాతిముఖ్యము జూడ।
నెఱుకలేక తిరుగ నేమిగలదు।
యెఱుకగలుగు నతఁడె జాతిగలవాఁడు।
విశ్వదాభిరామ వినురవేమ॥

క॥ అజ్ఞానమె శూద్రత్వము । సుజ్ఞానము బ్రహ్మమౌట శ్రుతులనువివరా । యజ్ఞాన ముడిగి వాల్మికి । సుజ్ఞానపుబ్రహ్మ మొందెఁ జూడర వేమా॥

గీ॥ తనదుతల్లిలంజ తనయులు మాదిగ।
శ్రీపతికిగురువు వశిష్టుపరయ।

కులముకన్న నెంచ గుణమె ప్రధానము।
విశ్వదాభిరామ వినర వేమా॥

హంసతత్త్వ సంగ్రహము.

శ్లో॥ హృత్పద్మ నిలయోజ్ఞానాం దూరస్థ ఇవభాతియః॥
ప్రమాణాతీత సద్భావం తంవందే జ్ఞానసాక్షిణమ్॥

గమాగమస్థం గమనాదిశూన్యం చిద్రూపదీపం తిమిరాపహారం పశ్యామితే సర్వజనాంతరస్థం నమామిహంస పరమాత్మరూపం.

హకారమును పురుషుడనిన్ని సకారమును ప్రకృతియనేస్త్రీయనిన్ని రెంటికిసంయోగ బిందువును చేర్చగా హంసయగు జీవుండాయెను మనోమారుతములతోగూడి ప్రకాశించెడి హకారమే పరమాత్మ పురుషుడనియును స్వశక్తుడనియును సకారమగుప్రకృతియనేస్త్రీతోబిందుయుక్తముగాచేరుటచేఆత్మయనంబడుచుండు నాయాత్మయగు సబళబ్రహ్మము తొమ్మిదివాకిళ్లుగల నీశరీరమను పట్టణంబున నింద్రియప్రాణ మనస్సులతో మెలగుచు (పంజరంబున చిక్కియున్న చిలుకసామ్యముగా) తప్పించుకొనిపోజాలక సుఖదుఃఖము లనుభవించుచు హంసందగు జీవుండు అగ్నిమండలి చంద్రమండలములనెడి రెక్కలచే నెగిరి ఓంకారమను ప్రణవశబ్దమును విని యానందమునసాక్షి సుషుమ్నమార్గమందే లయమగుచు బ్రహ్మానందమును పొందుచుండును.

క॥ దేశికనాథుని మహిమను। దేశమువలనగా వివేకదృష్టివల

పద । నాశస్థలము సుషుమ్నా । దేశంబని దానికీలు దెలియ
గవలయుఁ ॥

మ॥ కలహంసాన్విత నాదబిందుకళలైక్యం బెప్పుడో నప్పుడు।
జ్వాలకరూపకశిఖ ప్రకాశముగతిఁ సర్వేంద్రియోపేతి।
కానిలచిత్తంబులు శూన్యమైచనగ దానిర్వ్యాతదీపోపమా।
చలపచ్చిత్సుఖ విగ్రహాత్మకులరుఁ సంపూర్ణులై యంతటన్ ॥

నాదబిందు కళలతోఁగూడిన ఆత్మయగుహంస యెప్పుడు
విలయమందుచుండునో నాయవస్థ తురీయంబనియును ఉన్మని
భావమనియును అమనస్కభావమనియును పరిపూర్ణసమాధియ
నియును మోక్షమనియుడి బ్రహ్మానందమనియును నెఱుఁగఁగాఁ

హంసయనియును పరమహంసయనియును జీవుని శివునిభా
వించెదరు హంస పరమహంసైక్యమనగా శివునియందు జీవుని
లయింపజేయుట శివజీవైక్యముగా నెఱుఁగవగు కొందరు రేచ
క పూరకములచే ప్రాణమనేజీవుని కుంభించిపట్టి నాదానందు
లై సాక్షి బ్రహ్మమునందు లీనమైయుండుటయనియును వక్కా
ణించెదరు యీహంస విషయము యింతకుముందే హంసబీజ
ములతో స్వరజ్ఞాన వివరణమందు చెప్పంబడియున్నది గావ
గురుముఖంబున సాధనలంది సుజ్ఞానతత్వ పూర్ణోదయ
మందందగు.

మ॥ సుగుణత్వంబునతత్వభేదనియతిన్ సొంపొందగాలేకయు।
సగుణంబంచును నిర్గుణంబనికదుఁ సందేహముఁ బొందు

చ॥ నిగమార్థప్రతిపాదకత్వములచే నిత్యంబుగావింతురీ।
జగతిం గొందరు తామునేయనుచుమదాఖ్యశ్రాదికారంబునన్॥

నిత్యానిత్య విచారణ.

నిత్యానిత్యములను లక్షణభేదంబులచే విచారించగా బ్ర హ్మనిత్యమనిన్ని ప్రకృతియగుమాయ యనిత్యమనిన్ని తెలి యుచుండు తెలివిచేగ్రహించి నిత్యమైన పరమాత్మయందు అనిత్యమైన జీవునిలయింప జేయుటకు గురుసాంప్రదాయక సు జ్ఞానరత్న పూర్ణోదయ భావమందు అట్టిపరమాత్మస్వరూపమే తానుగాభావించి పరిపూర్ణుండై అద్వితీయుండై సర్వవ్యాప కుండై అసంగుడై యుండెను తెలివియే నిత్యవస్తువై ప్రకాశిం చుటగానెఱింగి తన్మయుండై యుండుటే ముక్తియని అనేకప్ర మాణంబులున్నవి (పరిపూర్ణోహం) (అద్వితీయోహం) (వ్యా పకోహం) (అసంగోహం) (నిత్యోహం) (శుద్ధోహం) (స్వప్రకాశోహం) (బ్రహ్మైవాహం) (శివోహం)(ఆత్మాహం) (పరిపూర్ణోహం) అనగా సముద్రములో ముంచియుంచు కుండ కు వుదకము పరిపూర్తిగా నిండియున్నట్లు నిత్యవస్తువైన పర మాత్మయందు అనిత్యవస్తువైన జీవాత్మ యితరచింతలుమాని లీనమగునప్పుడు పరమాత్మస్వరూపమై తండోపస్తువుదోచక స్వప్రకాశతేజములోనె గలియుచుండుట పరిపూర్ణబ్రహ్మనం ద సుఖమైన విదేహముక్తిగా గ్రహించవగు సర్వపరిపూర్ణు డైనందున ఆనందస్వరూపుడనిన్ని అమృతశరీరుడనిన్ని సత్తుచి త్తు ఆనందములు గలడైనందున సచ్చిదానందమనిన్ని సంకల్ప

వికల్పములు లేనందున నిర్వికల్పుడనిన్ని షడ్భావవికారములు లేనం దున నిర్వికారుడనిన్ని జగద్విలక్షణుండైనందున నిష్ప్రపంచుడ నిన్ని అవాఙ్మానసగోచరుండైనందున నిరంజనుడనిన్ని సత్వరజస్త మోగుణ శూన్యుడైనందున నిర్గుణుండనిన్ని దేహేంద్రియము లు లేనందున నిరాకారుడనిన్ని నాశము లేనందున అవ్యయుడని న్ని కూటస్థుడైనందున అక్షరుడనిన్ని ఖండములుగా నుండనం దున అఖండుడనిన్ని కొరత లేనందున సర్వపరిపూర్ణుడనిన్ని చా వుపుట్టుకలు లేనందున అమృతరూపుడైన నిత్యుడనిన్ని మొద లు మధ్యతుది లేనందున ఆదిమధ్యాంత రహితుడనిన్ని (ఏకమే వాద్వితీయం బ్రహ్మమై) నిత్యమై సత్యమై శాశ్వతమై ప్రకా శించుచున్న పరమాత్మ సంయోగానందము శ్రీగురుస్వాముల కృపాకటాక్షమును బొందక మోక్షమనెడి బ్రహ్మానందము చిక్కదు.

శ్లో॥ విద్యాంతం బ్రహ్మవిద్యాంతం వార్తికాంతమగోచరం।
సాంప్రదాయం పహాంత్యాంతం మానం నిర్వాననంహితే॥

అన్నివిద్యలలో సూక్ష్మాన తత్త్వ పూర్ణోదయ వేదాంతమును గురుస్వాములవల్ల గ్రహించి కైవల్యమానముద్ర నార్జించుచుండ గు మహానుభావులైన బ్రహ్మవేత్తలగు ఋషులు మొదలైన వారు తమతమ శిష్యులకు తురీయమైన బ్రహ్మానంద మువదేశిం చి యింతకైనను పరమరహస్యము వేరే లేదని (ఆనందో బ్రహ్మ ణోవిద్వాన్) అని చెప్పియున్నారు గనుక శరీరమను క్షేత్రము నందు గంగాయమున సరస్వతులును దర్శింపజేసి ఈశ్వరుని

యందు భక్తివిశ్వాసమే సర్వదేవతా సంతర్పణమనియును ఆప రంధాముని హృత్పద్మ పీఠంబున నిలిపి ఆరాధించుటే మోక్ష సాధన మనియును అంతరచిత్సమాది తుర్యంబున ప్రత్యక్షా నుభవమందు చూడుటయే శివజీవైక్య సమాధియని దృఢం బుగా నుపదేశించి యున్నారు ముముక్షువులయిన భక్తాగ్రే సరులు సుజ్ఞానతత్త్వ పూర్ణోదయ నిర్వికల్పసమాధిలో జీవు ని పరమాత్మయందు లీనము చేయుచుండుటయే విదేహముక్తి గా గ్రహించందగు.

నిర్గుణాత్మవిచారణ.

శ్లో॥ నిర్గుణోనిష్క్రియోనిత్యో నిర్వికల్పో నిరంజనః ।
నిర్వికారోనిరాకారో నిత్యముక్తోస్మి నిర్మలః॥

శ్లో॥ నిరంజనం నిరాకారం దేవదేవం జనార్దనం ।
మాయాయుక్తం జపేన్నిత్యం పావనం సర్వదేహినాం॥

శ్లో॥ నామరూప క్రియాతీతం నిస్సంగం దేవవందితమ్ ।
నారాయణం శివంశుద్ధం దృశ్యదర్శన వర్జితమ్॥

సూర్యుండు గ్రుంకు వేళ కిరణములు సూర్యునితోడనే పోవు చూడువట్లు నిర్గుణసమాధియందు మనోవ్యాపారములు లయ మొందు చుండుటయే బ్రహ్మానందము॥

క॥ ఇదిఇదియనాత్మనేగా। నిదిబ్రహ్మము నేనటంచు నెఱుగు న
జనమై। కదలసిమరీయిటులామది। గదిసి తెలియు పరజ్ఞస్వ
ప్రకాశాత్ముడగు॥

గజేంద్రుడు శంకరవంబునుజూచి దేహస్మృతితప్పి నిరాశ

చే యేటుగాచావుదప్పదని చెలించక నిలువంబడి యుండుభంగి బ్రహ్మమునుగన్న జీవుండు మానసేంద్రియ వ్యాపారములుమఱచి నిష్ప్రపంచుండై బ్రహ్మానంద సుఖమనుభవించుచుండును॥

బ్రహ్మవిద్వరిష్ఠుండు నిర్గుణపరిపూర్ణ సమాధియందు సాక్షాత్కార తురీయుండై కుండలోని దీపపుకాంతివలెను సూర్యప్రకాశములోని కర్పూరదీప సామ్యముగను కూటస్థ పరబ్రహ్మమునకంటె వేఱుగాక లయమందియుండుటయే జీవేశ్వరుల కైక్య రూపమైయెప్పుడి నిర్గుణసమాధి నిష్ఠయనియును సహజానుసంధాన రాజయోగమనియును విదేహ జీవన్ముక్తియనియును నెఱుంగనగు॥

శ్లో॥ అహమాకాశ వత్సర్వం బహిరంత రతోచ్యుతః।
సదాసర్వ సమస్సిద్ధో నిస్సంగో నిర్మలోచలః॥

శ్లో॥ నిత్యశుద్ధవిముక్తైక మఖండా నందమద్వయం।
సత్యజ్ఞాన మనంతయత్పరం బ్రహ్మాహమేవతత్॥

శ్లో॥ రూపవర్ణాధికంసర్వం విహాయ పరమార్థవిత్।
పరిపూర్ణచిదానంద స్వరూపేణా వతిష్ఠతే॥

బ్రహ్మసాక్షాత్కారమునందలి యోగదృష్టిలో జగత్తును తనయందును జగమునందు తానును జూచుచు భ్రమరకీటకన్యాయంబుగా జగద్వ్యాపారయుక్తమగు కామక్రోధాదిరాక్షసులు జ్ఞానాగ్నిచే దగ్ధమైపోగా జీవన్ముక్తి లభించును.

శ్లో॥ నిర్వికారో నిరాకారో నిరవద్యోహ మవ్యయః।
నాహం దేహోహ్యసద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః॥

వికారములేనివాడును స్వరూపములేనివాడును దోషములేనివాడును నాశము లేనివాడును అయిన సుజ్ఞానతత్త్వ పూర్ణోదయ పరబ్రహ్మానంద సాక్షాత్కారమందు చేరుటయే విదేహకైవల్యమని పెద్దలు నిర్ణయించియున్నారు.

జడపదార్థములను దీపపు కాంతిచే జూడంబడునుగాని దీపమును నాజడపదార్థములు జూడంజాలవు అటుపరమాత్మను నిర్గుణ వృత్తిచే గ్రహించవలెగాని యింద్రియ మనంబులు నెఱుంగం జాలవు.

ఉ॥ శ్రీవిరళప్రపంచమును శ్రేష్ఠముగా పరమైనబ్రహ్మమే।
తానస్వతంత్రమైయచటతత్త్వముపుట్టువుచావులేకలో।
పోనకురాకయుండె సుకృతభక్తులకాంతర యోగనిష్ఠచే।
గావగనద్భుతనిత్యమది కన్నులమానస దృష్టిగల్గినగా॥

సీ॥ కమలాసనస్థుడై కాయంబునిక్కించి కరములూరులజేర్చి
కనులుమూసి। దేహేంద్రియప్రాణ ధీమనాధికమెల్ల దృ
శ్యమేగాను ద్రష్టృత్వ నేను। దృశ్యమేగాను ద్రష్టృత్వ నేన
నువృత్తి దృశ్యంబుగాన ద్రష్టృత్వ నేన। యనివిజాతీయ
ప్రత్యయవివృత్తిగా సజాతిప్రత్యయ ప్రవృత్తిక్రమమున।
నాత్మదాసైన యందాకనయ్య శేష। దృశ్యదృగ్వృత్తులను
నిషేధించుకొనుచు। ననిశమాత్మావలోకన మందుచుంట।
నిర్గుణధ్యాన మనజెల్లు నిర్మలాత్మ॥

పద్మాసనాసీనుండై కాయమునిక్కించి హస్తములను తొడలపైనునిచి నేత్రములుమూసి స్థూలసూక్ష్మకారణ శరీరముల

ను పదునాలుగు యింద్రియములను దశవిధ ప్రాణంబులను దృశ్యముగా నెఱింగి దృశ్యంబుల కన్నింటికి తానువేరని గ్రహించి సత్యజ్ఞానానంద నిర్మలాఖండస్వరూప పరబ్రహ్మమే తానను వృత్తి దృఢమగుదాక సాక్షి నిర్వికల్పుండై యుండు నిష్ఠయే నిర్గుణ పరిపూర్ణ బ్రహ్మానంద విదేహ కైవల్యముగా నెఱుంగవగు.

—[*] కందార్థము. [*]—

ఆశయె యిహపరదుఃఖం । బాశయెభవ నాశయుక్తి యవనీస్థలిలో । నాశయెజన్మకు కారణ। మాశయెమది జెరచుచుండు॥ నపరోక్షమందు ♦ నిర్గుణమందే ♦ తపములయందు॥ జపతపములలోన జనియించివేవేగ। నెవములుగల్పించి నిస్పృహగావించు। చపలచిత్తపు సాగరంబున చర్చజ్ఞానప్లవము నెక్కుడు। యపముచే దెగటార్చిదాటుము। యుపరిభాగమెబట్టబయలగు॥ నపరోక్షమందు ● నిర్గుణమందే ● తపములయందు॥

గీ॥ అచలయోగతప మాత్మను సంధించి।
ప్రచురపరచిముక్తి ప్రతిభ గాంచి।
విటల మర్గమెక్కి నిర్గుణమందుటు।
నిజవిదేహముక్తి నిరత్యయంబు॥

శ్లో॥ నిర్గుణో నిష్క్రియోనిత్యో నిత్యముక్తో హనిశ్చితః।
నాహం దేహోహ్యసద్రూపో జ్ఞానమిత్యు చ్యతేబుధైః॥

నేను గుణరహితుడను క్రియా శూన్యుడను శాశ్వతుడను నిత్యముక్తుడను పరబ్రహ్మసంయోగ మందితినని సుజ్ఞానతత్వ

పూర్ణోదయమంది శరీరమును మఱచి యుండుటే ముక్తియని పెద్దలు వర్ణించి యున్నారు.

—[*] కందార్థము. [*]—

చెడిపోవ నున్నతనువిది। పుడమిని నిజమనుచునమ్మి బోలి యుబుకరకటా। యిడుములకు నీడ్పిదుఃఖము। నుడివక తపియించునాను॥ సుషుప్తిదాటుమురా। సత్తమమైన। జ్ఞప్తిమీటుమురా। తృప్తిగనిన్నించు దీపికజ్ఞానమ స్సుప్తమాగురిదాటి। గుణవడుమచ్చుట సప్తద్వీపములందు వెదకిన। స్వానుభవమానందవరమ సుషుప్తిదాటగ నిర్గుణంబగు చూపిచెప్పగ। రానిదదియౌను। సుషుప్తిదాటుమురా। సత్తమమైన। జ్ఞప్తిమీటుమురా॥

ప్రత్యగాత్మయగు పరమాత్మయందు జీవభ్రాంతి తొలగి నిర్గుణమై నిష్క్రియమై నిర్వికల్పమై నిరాకారమై అద్వితీయమై సదాశివ పరబ్రహ్మమందు లీనమైన జ్ఞప్తియగు మెలుకవశించుటే జీవన్ముక్తి.

చ॥ అమదగు సాత్వికోదయ సమాధినినిర్గుణజ్ఞానతత్త్వముఁ।
గురుమతి మంచునిల్పినయ శోకవిఘులెల్ల ప్రసన్నబుద్ధిచే।
నిరుపమ సాధుమార్గ మహనీయగుణోన్నతిచే ప్రసక్తులై।
చిరతర శాంతిఁబొందిమరి చిత్తము ముక్తముగా నొనర్తు
రెప్పుడున్॥

జీవన్ముక్తి వివరము.

శ్లో॥ హృత్పద్మ నిలయాజ్ఞానాం దూరస్థ ఇవభాతియః।
ప్రమాణాతీత సద్భావం తంవందే జ్ఞానసాక్షిణమ్॥

శ్లో॥ యద్దృష్ట్వా నాపరం దృశ్యం యద్భూత్వానపునర్భవః॥
యజ్ఞాత్వానాపరంజ్ఞేయంతద్బ్రహ్మేత్యవధారయేత్॥

ఏవస్తువునుజూచిన నితరవస్తువులు కానంబడవో నావస్తువుతో నైక్యముపొందిన జీవన్ముక్తి ఘటిల్లునని పెద్దలు వచించెదరు. అంతరిక్షము అనగా ఆకాశము నాయాకాశము నిరవధిక శూన్యమైయుండు నందు మహాకాశము గాఢాంధకారమైనది యందు పరాకాశము ప్రళయానలమయినది యందు తత్త్వాకాశము అతిధృతి ప్రచయమై యుండునది యందు సూర్యాకాశము రవికోటి సంకాశమై యుండు నిట్టి పంచాకాశముల కతీతమై వాచామగోచరమై పరబ్రహ్మ స్వరూపమై పునరావృత్తి రహితమై నిష్కళంక హృదయమైన బ్రహ్మ యజ్ఞమును యోగసాధనలో బ్రహ్మార్పణముగా జేయుచు నవసాన కాలంబున పింగళనాడీ మార్గంబున బ్రహ్మలోకము చేరి బ్రహ్మమందైక్య మొందుటకు నుత్తరాయణ శుక్లపక్షమి పగలు పౌర్ణమి వరకు గలదినములలో శరీరము విడచుట బ్రహ్మసాయుజ్య మనియును సూక్ష్మనాడీ మార్గమున ఆత్మ దర్శనమందిన తోడనే నవవిధమోహన పూజలుగావించి నాదబిందు కళల కతీతుండై హంసయందు జేరి నీవే నేను నేనేనీవను దృఢప్రజ్ఞలో యొుటక సహాయంబును పొంది ముక్తికాంత యగు మోక్షలక్ష్మిని సహస్రారమహదాకాశ స్థానంబున జేర్చి యాపీఠమునందు టూగుటుయ్యలలో చేరి యొుకటిట్టుగా కూర్చుకొని సోహం హంసోహం బనుచు సంయోగమందు నుండుటయే బ్ర

హ్మానందమగు విదేహముక్తి యిట్టి పరమ రహస్యమును సద్గు రుస్వాముల కరుణచే సుజ్ఞానతత్త్వ పూర్ణోదయముచే గ్ర హించనగు.

మత్తకోకిల॥ ఉత్తమూయలు పోరుజ్ఞానులుఁగూరికేచరియింతురా।
మెత్తుమీదను భూరిగుణములు యేకముగ గావింపు
చుణ। సత్తుతో సదసత్తు గలియగ సాధనములకు
చక్కనై। పొత్తుబడు బ్రహ్మాంబులోపల పూర్ణ
మై నాయుందునే॥

గీ॥ మేనుమర్దమైన మిహిమని జెపచును।
చిత్తమర్దమయిన స్థిరము జెపచు।
మఱవు లక్షమయిన మఱిముక్తి జెపచురా।
విశ్వదాభిరామ వినరవేమ॥

మ॥ భరతుండల్లన సంధ్యకాలము వె సంభ్రాంతింపగా సర్వదా।
హరిణంబుంగను బుద్ధిగతి సల్యాసక్తి రక్షింపగా। హరి
ణంబుందన యాత్మలోనిలిపి దేహంబంతటంజాలితా। హరి
ణిగర్భమునజనించి హరిణంబై యుక్త బూర్వస్మృతిణ॥

కాబట్టి యితర చింతలులేక నిర్భయంబుగా పరమాత్మయం దుజ్ఞప్తిని కృపపరిచి దేహమును విడిచిన యోగి పరమాత్మ యందే లీనమై జన్మమరణాదులకు రాబోదని తెలియంగనగు.

సుజ్ఞానతత్త్వ పూర్ణోదయ సంగ్రహము.

శ్లో॥ నమస్తే లోకనాథాయ పరమజ్ఞాన రూపిణే।
సద్భక్తజన వాత్సల్యాం శీలనే మంగళాత్మనే॥

శ్లో॥ రక్షరక్ష మహాదేవ క్షమస్వ కరుణాలయః॥
భక్తచిత్త సమాసీన బ్రహ్మవిష్ణు శివాత్మకః॥

గీ॥ శరణు శ్రీపరమదేశిక శరణుశరణు।
శరణు బ్రహ్మోపదేశికా శరణుశరణు।
శరణు శరణాగతత్రాణ శరణుశరణు।
శరణు యస్మద్గురు ప్రభో శరణుశరణు॥

భాగవతములోని పద్యములు.

ఆ॥ జనుల కెల్లశుభము సాంఖ్యయోగముదాని। వలనధర్మనిష్ఠ వలననైన। నంత్యకాలమందు హరిచింతసేయుట। పుట్టువునకు ఫలము భూవరేంద్ర॥

క॥ వినుము సర్వ భావములబర। మునినవఘువనంతు నీశుబురుషోత్తము। సన్మమున భజియింపుముముద। ముఃనబునారావృత్తిలేని ముక్తి లభించుౙ॥

క॥ జీవన్ముక్తి లభించుం। గావునసేమరక తలపు కైకొసదీని। వావిరి నొల్లనివారికి। దావలమగు మృత్యుభయము దవ్వగు సుఖముల్॥

క॥ గోవింద నామకీర్తన। గావించిభయంబు దక్కి ఘటాంగధరః। శ్రీవిభుడు నూరగానిమెను। కైవల్యము దొల్లిరె.డు ఘడియలలోనౙ।

తే॥ అరసినిర్గుణ బ్రహ్మంబు నాశ్రయించ।
విధినిషేధ నివృత్తి సద్విమలమతులు।

౧౪౩ సుజ్ఞానతత్త్వ ప్రార్థో దయం బను
సేయుచుందురు హరిగుణ చింతనములు।
మానసంబున నెప్రొద్దు మానవేంద్ర।

—[*] ద్విపద. [*]—

శ్రీకరనికరమా - చిరజీవముక్తి। చేకొనగోరుట - శివ
పాదభక్తి। ప్రాకటంబైయొప్పు - పరమగురభక్తి॥ సోకినవారికి-
నూత్మానుభక్తి॥ పూనినవెంటనే - పురికొనియుక్తి। మానకగు
రుభక్తి - మరిగెడుకభక్తి। ధ్యానయోగముబూని - దర్శనమంది।
స్వానుభవంబయిన - స్వర్గమునొంది। సాధువృత్తిసినమ్మి - సం
ధానమూని॥ వేదవేద్యమటంచు - విడువకపూని। తానగుగురునా
జ్ఞ - తగిలి [illegible] దెంపు। జ్ఞానోదయంబుచే - జ్ఞప్తికినిరవు। సద్బ్రహ్మస్వ
రూపమును - సాధించవలెను॥ మచ్చికఋషులకు - మానవమెయగు
ను॥ సత్యముబయలని - సన్మార్గమునులు॥ నిత్యనిర్గుణమూని - నిల
తురుఘనులు। పుట్టుచావులు లేని - పూరతమూహించి। గుట్టుచెవ
రనివట్టు - గుప్పించిపొంచి॥ నియమాగ్నులోబుద్ధి - నిలిపెడిప్రవతము॥
నయమాత్మబ్రహ్మమై - యాదిమజపము। మనసు మారుతదృ
ష్టి - మహాతత్త్వజ్ఞప్తి। పనుపడబ్రహ్మమాయి - ప్రబలుటతృప్తి।
గురుపాదభక్తిచే - గుర్తించవలెను॥ స్థిరమార్గమునిదీని - చింతించ
వలెను। తెలియబోధించెడ - తేటగురుభక్తి॥ అలవిగాదనరాదు -
అంజకభక్తి। పొందినమదిలోన - పూజ్యానియెంచి। దంభవలన్ని
యు - దాపునమించి। మునుకొనిపరమాత్మ - మూలముద్ధలచి।
కనిగ్రుడ్డునిలద్రొక్క - కాయమున్మరచి। సత్యసంస్మరణమై -
సంభృతియుపమ॥ నిత్యనిర్గుణమున్న - నిజరూపదిపము॥ సద్రూప

మునజేర్చి- సమదృష్టినంటి॥ చిద్రూపగమ్యలై - చిత్పరమంటి॥
భద్రమౌపద్మచక్ర- ఖావముల్ మరిగి॥ ముద్రలుమంత్రముల్ -ము
క్కునుఠిగి॥ బోధించిధీసాక్షి- బోమముడిసోజ్ఞ॥ శోధించిలో
మించి-సుస్థిరప్రజ్ఞ॥సహస్రారమునజేర్చి-సమదృష్టిబూని॥నిహ
ఫరవాంచలు- నిరతియుమాని॥ పోరుచునాదంబు- పురికొల్పి
నుచు॥ జేరిదహారమునంటి- చిచ్ఛక్తిగనుచు॥ వినిగనుటలుమా
ని-వితమరఁడగుచు॥ పనిబూనినిశ్శబ్ద- ప్రతిష్ఠయుడగుచు॥ బార
డుహంసను- బట్టిరేచించి॥ పూరించికుంభించి- పురికొనిమించి॥
దక్కంగబూనుకేం- తన్మయుఁడపము॥ నిక్కంబుగానాత్మ - నిది
ధ్యానతపము॥ హత్తించిమదిపూర్ణ- హంసైక్యమూని॥ హత్తు
నమొయికను- పోకార్చిపూని॥ తెలియుతెల్వియె తెల్వి తేటమా
హంవ- గలియుటసంయోగ గమనైక్యమౌన॥ నిర్మలనిజరూప
నిర్గుణమొదవు- నర్మిలిపరమాత్మ మయిక్యమేయిరవు॥ పపుడు
రినతోడ ఏకాంతమదియె- చూపునొండని చూపునదియె॥ పో
హణాలన్నియు పుములోడునచట- లాహిరిమించిన లయమందు
నచట॥ నిండినపరిపూర్ణనిద్రబూని- పండినిండినతోడ బయు
లగుదాని॥ యాదిమధ్యాంతోంబు నందరాదేవుడు-ఆదిశనాదిరై
యనువొందదేవుడు॥ పొందినతిచ్ఛలో పురడించుచుండు॥ నం
దరాదేశి నచలమైయుండు॥ పాలునీరును జేరి పక్వమయినట్లు-
మేలుకీసును రెండు మెలగియున్నట్లు॥ పదునాలుగులోకముల్
ప్రబలియంతటను॥ మొదురుగానుండుట మెరుగరెవ్వరును॥ అ
జ్ఞానశ్రతువుల కనువొందకుండు - సుజ్ఞానబ్రహ్మంబు సూక్ష్మ

మాయియుండు॥ వాయువశంబున వశముగాదదియె- బాయని ని
ష్టలో బయలగునదియె॥ నేత్రోత్సవంబున నెలకొనబోదు -
గూత్రలలోనైన యనుపొందరాదు॥ దేహమున్మరచిన దేహి
కిరవు- మోహమునంటక మఱియు మోమాటు॥ పదిలమానుజ్ఞాన
పరతత్త్వమంది - కుదిరికైతోజ్ఞప్తి కూర్పించెంపొందె॥ ధ్యాన
సమాధిలో తన్మయుండగుచు- పూనియుండెడిజ్ఞప్తి పొందికస్థ
ముమ॥ చూపులలోమించి చూచుటమరచి- దాపైవయెఱుకను
తగిలితన్మరచి॥ నప్పాటెకైవల్య మచలభావంబు ॥ యొప్పా
మునస్తోక ముజ్వలాకారంబు । ఎదేదినిజమని యెఱిగించునెఱు
క - సాధనలోగాని సమసిపోదెఱుక। నాశమనాదియైయున్న
టనిను - జోకతో పరమాత్మ జ్యోతియైయుండు । నానా
విధంబుల నడయాడుచుండు - శూనిస్మరించుట పూతమగు
చుండు। జీవాంశపరమయిన-చిద్బ్రహ్మమగును। భావాన్వితం
బైన-బయలదేయగును॥నిజగంబులుమిధ్య-నిజమచలంబు। నా
ల్లుపరమాత్మ-గతితత్త్వంబు। బట్టబయలయినయా- బ్రహ్మంబు
నెంచి। గుట్టుచెదరనిపట్టు-గుప్పించిమించి। పట్టుగాద్వాదశి-వ
లుకులునమ్మి। చిట్టడిపూర్ణుడై-శిలతలుజమ్మి। యుత్తమీబయ
లనే యునలంభమంది ॥ పాత్రేమిలేదనె- పొందికన్పొంది। యు
ష్టాక్షరంబుల ననువుగామఱిగి- నిష్టలోషోడశి నిజమూలమెఱిగి॥
విదితయోగాతీత వేదవేద్యంబు । నడయుతలోమించ నత్యాస్ప
దంబు॥ యవినాశిబ్రహ్మంబు- యచలమూజ్ఞప్తి॥ ప్రవరులకందు
ను- ప్రాపింద్యముక్తి॥ యిదిసుమహాగోప్యంబు- నెఱుగనవ్వరును॥

నీదివ్యబోధచే- నిర్గుణమగును। వింతలన్నియుసున్న- విద్యోతిశ
క్తి॥ సంతంబుగానెంచి- పాలించముక్తి॥ సందియమేలేదు- సా
ధనయుక్తి॥ అందిపొందెమరీతి- యనుభవముక్తి॥ ముముకొనిహా
క్షించి- మూలముగ్గమంచు॥ వనిబూనివ్రాసితి-పరిత్రాణమనుచు।
వినికనియెరుగని- వెడగులకైన। కనివినియెరిగిన- గతిముఖ్యమై
న। శివమొందజేసి-సంశీలులజేయు। భవహరంబైనట్టి-భవ్యము
జ్ఞేయు। భావముదించెడి- బ్రహ్మగురూక్తి॥ సేవజేయకగాని-
చిక్కదుయుక్తి। ధ్యానించువారికి- దర్పణమిదియె। జ్ఞానయో
గమునంట- గమకించునిదియె। ప్రాలుమాలనిబుద్ధి- పట్టిసాధిం
చి। గ్రాలుచుండెడిమాత్మ- గతిపొందమించి॥ మరిగినతోడనే-
మైమరపుబుట్టు॥ యెరిగమరిగినతోడ - యేకమైనట్టు। సత్యము
లోనెంచి- సాధించనగును। నిత్యమాముక్తి- నెరవిడేయగును।
కల్పనయనిలోన- గమనించిరాము। స్వల్పముగానెంచ- సఖ్యా
బుగాదు। హరిహరబ్రహ్మల- కలవిగాదిదియె। స్థిరమోక్షసిద్ధి
కి - శివమునకునిదియె। పరిపూర్ణమనిదీని - పాలించవగును।
సుస్థిరంబుగనాత్మ - గుర్తించవలెను॥ గురుభక్తితోముక్తి -
గుర్తించపోరి। యుంలించుచుసాక్షి- యున్మనిదారి। కాయము
స్మరచియా- ఖంబ్రహ్మదగిలి। నాయురారోగ్యులై- యచల
ముగాపొంది। పరవశ్యులై భువిని- వర్ధిల్లవలెను। నిరతిశయానం
ద- నిజతత్త్వమిలను। మీరివర్ధిల్లును- మీనుకుసత్యంబు। సరిత
ముగానివివిన- సందర్శనంబు। మతిసుఖమోక్షంబు - మననంబు
గల్గు। సాదాకరవిచంద్ర- లందాకసుధవి। నందాకతారలు-

నెందాకవృధివి॥ నెందాకనాకాశ- మెందాకనదులు॥ నెందాకనీ
కృతి- యవనియందుండి॥ యనువొందజేయును-నాత్మానురక్తి॥
సౌష్టవాగురుభక్తి- సత్యకూగాత॥

మంత్రోపదేశ వివరము.

లోకంబున గురువులు తమతమ శిష్యులకు బోధించుచుండెడి మంత్రముల వివరము.

| | |
|---|---|
| ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ ఏకమేవాద్వితీయం బ్రహ్మ | అనెడి మంత్రములనుబోధించి ధ్యానంబున ప్రణవరవళిని వినుచు ఆరవళియందే మనస్సు లయ మదించుచుండుటయే మోక్షసాధనమని యుపదేశించు చుండెదరు. |
| రామ - కృష్ణ - శివ శంభో - హాం-హూం- | యిందులో నెద్దానినైనా బోధించి ఆనామోచ్ఛారణ యందే మనస్సును లయింపజేయుచుందుమని బోధించెదరు. |
| నారాయణ నమః శివ | యనవిష్ణుశివ చతురాక్షరముల దెల్పి యాచతుహాక్షరులను ధ్యానము చేయుటవల్ల మోక్షమబ్బునని బోధించుచుండెదరు. |
| నారాయణాయ నమశ్శివాయ | పైవలెనే పంచాక్షరీ మంత్రము లనియును వల్లె షడాక్షరి ఓన్నమశ్శివాయ యనియును |

అష్టాక్షరి ఓన్నమోనారాయణాయనియును ద్వాదశాక్షరి ఓన్నమోభగవతే వాసుదేవాయయనియును సంస్కృతములో

నుండెవి (అయం వ్యర్థం, బాహ్యాశోపీన భవతి) అనగా (ద్వాద. శి మంత్రము) తెనుగున (ఉత్తదీబట్ట బయలు యేమిలేదు) అని బోధించి స్మరించుచుండ మనెదరు అట్లే పంచదశి సంస్కృతం. బున నుండెడి (స్వప్నే ప్రతీయమానాని రూపాణి యథాతథా) అనియును తెనుగున ( కలదోచిన శరీరములేలాగో అలా. గే) యనిబోధించి స్మరించు చుండుమనెదరు. అట్లే షోడశాక్షరి సంస్కృతములు (మూలాధార మిదంజ్ఞాత శరీరం కిమునాస్థిహి) అనగా తెనుగున (మూలములేని గుర్తిరిగే శరీరం యేమిలేదు) అని బోధించి స్మరించుచుండు మనెదరు. వారివారి యిష్టానుసారముగా శిష్యులకుపదేశము చేయుదురు. హంస బీజమంత్రము (ఓం హ్రీం శ్రీం హం సం) అను హంస పంచ బీజములను షణ్ముఖి ముద్రచే ఓంకార ధ్వనివినుచు రేచకపూరక కుంభకములలో సిబీజములను ధ్యానించుట హంస బీజాక్షర యోగముగా దెల్పిధ్యానించి పరవశులై విదేహముక్తి అనగా పరిపూర్ణానందమును బొందుదని వివిధోపాయంబులచే స్మరింపం జేయుచుందురు యిందుకు ముఖ్యమగు మనస్సు బ్రహ్మానందము నెందుకే ముక్తిగా గ్రహించవలెను.

పరమాత్మ నిరూపణ వాక్యములు.

౧. ఓంమిత్యేకాక్షరం బ్రహ్మ ౨. సర్వంఖల్విదంబ్రహ్మ।
3. ప్రపంచస్వరూపం బ్రహ్మ ౪. సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ।
౫. ఏకమేవాద్వితీయంబ్రహ్మ ౬. ఏకమేవాతత్పరంబ్రహ్మ।
౭. స్వయంప్రకాశంబ్రహ్మ ౮. అఖండానందాద్వయం బ్రహ్మ।

౯. ఏకోనారాయణః ౧౦. దేవఏకో నారాయణః॥
౧౧. ప్రజ్ఞానంబ్రహ్మ ౧౨. అహంబ్రహ్మాస్మి॥
౧౩. అయమాత్మాబ్రహ్మ ౧౪ తత్త్వమసి॥

యిట్లు అనేకప్రమాణములచే నిరూపించాడి పరబ్రహ్మస్వరూప ధ్యానమును సద్గురూపదేశంబున నెరింగి సుజ్ఞానతత్త్వ పూర్ణోదయమంది మనస్సును బ్రహ్మమునందు లయింపు జేసుకొనుటయే బ్రహ్మానందము మోక్షము విదేహముక్తియుని గ్రహించందగు.

చ॥ అగుపరోక్ష మాత్మగతి నంతమెఱింగి గణించువానికిం
దిగులెడబాసి ఘనతేజము దెల్పిచేగన్న ధక్షుడౌక్రుతుం
డౌగిగమునన్న దానెఱిగిమదియుప్పినదుఃఖనివృత్తియంతదా
మిగులగసందియంబుడిగి మేలుగనుంగొనయుంట మోక్షమౌ॥

ద్వాదశావ్యయస్తోత్రము.

శ్లో॥ నిత్యం నిరంజనంశుద్ధం నిర్వికారం శాంతమవ్యయం।
నిర్వికారం నిరాకారం పరబ్రహ్మం సమావ్యహం॥
౧. అనంగోహ మసంగోహ మనంగోహం పునఃపునః।
సచ్చిదానంద రూపోహ మహమేవాహ మవ్యయః॥
౨. నిత్యశుద్ధి విముక్తోహం నిరాకారో హమవ్యయః।
భూమానంద స్వరూపోహం మహమేవాహమవ్యయః॥
౩. నిత్యోహం నిరవద్యోహం నిరాకారోహ మచ్యుతః।
పరమానంద రూపోహ మహమేవా హమవ్యయః॥
౪. శుద్ధచైతన్య రూపోహ మాత్మారా మోహమేవచ।

అఖండానంద రూపోహ మహమేవా హమవ్యయః॥

౫. ప్రత్యక్చైతన్య రూపోహం శాంతోహం ప్రకృతేపరః॥
శాశ్వతానంద రూపోహ మహమేవా హమవ్యయః॥

౬. తత్వాతీత పరాత్మాహం మధ్యాతీతం పరశ్శివః।
మాయాతీతం పరంజ్యోతి రహమేవాహమవ్యయః॥

౭. నామరూపవ్యతీతోహం చిదాకారో హమచ్యుతః।
సుఖరూప స్వరూపోహ మహమేవాహమవ్యయః॥

౮. అంతర్యామిస్వరూపోహం కూటస్థం సర్వగోస్మ్యహం।
పరమాత్మ స్వరూపోహ మహమేవాహమవ్యయః॥

౯. నిష్కళోహం నిష్క్రియోహం సర్వాత్మాద్యస్సనాతనః।
అపరోక్ష స్వరూపోహ మహమేవాహమవ్యయః॥

౧౦. ద్వంద్వాది సాక్షిరూపోహ మచలోహం సనాతనః।
సర్వసాక్షి స్వరూపోహ మహమేవాహమవ్యయః॥

౧౧. నిరాధార స్వరూపోహ సర్వాధారో హమేవచ।
ఆప్తకామస్వరూపోహ మహమేవాహమవ్యయః॥

౧౨. తాపత్రయ వినిర్ముక్తో దేహత్రయ విలక్షణః॥
అవస్థాత్రయ సాక్షోస్మి చాహమేవాహమవ్యయః॥

ఈద్వాదశా వ్యయస్తోత్రమును అవసాన కాలమునందు మనస్సున స్మరించుచు ప్రాణమువిడచు యోగీశ్వరులకు ముక్తియెదురై నిలచును.

శ్లో॥ శ్రీరామరామరామేతి రమేరామే మనోరమే।
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే॥

యనియును స్మరించుట మోక్షానుభవ సాంప్రదాయకమే యగును.

శ్రీహరియొక్క అనంతనామములలో నేదైనాసరే లేక శివసహస్ర నామములలో నేదైనాసరే సర్వాత్మాండగు పరమాత్మ నామముగా నమ్మి నిజభక్తితో మనస్సున చపలమును రోసి స్మరించనగు అందులలో ముఖ్యమైనది (నారాయణ)యను చతురాక్షరినిగాని (నమః శివాయ) యను పంచాక్షరినిగాని జపించుటవల్ల నది యాత్మజ్యోతి రూపంబై కేవల పరమహంస ధ్యానంబై యోగిజనధ్యేయంబై భక్తజన సేవితంబై యొప్పుచున్నది ఇట్టిస్మరణ చేయుటయందు మనస్సున నేమరక దేవుని సూక్ష్మరూపమును సర్వావయవములతో దాచుచుండుట ధ్యానమనంబడును కోరికలేక సేవించి యానందించుచుండుట అర్చనయనంబడును పరమాత్మయందు సాక్షీలీనమగుచుండుట అనగా దేహము స్మృతితప్పి లోలోపల ఆనందించుచుండుట ఆత్మనివేదనం బనంబడును జ్ఞప్తిలేక తన్మయమందు చుండుటయే జీవన్ముక్తి యని గురువాక్యముగా గ్రహించి మోక్షమందందగు.

ద్వాదశ నారాయణ స్తోత్రము.

౧. ఓంనారాయణః పరంజ్యోతి రాత్మా నారాయణః పరః॥
నారాయణః పరంబ్రహ్మ నారాయణ నమోస్తుతే॥

౨. నారాయణః పరో దేవో ధాతా నారాయణః పరః॥
నారాయణః పరంధాతా నారాయణ నమోస్తుతే॥

౩. నారాయణఃపరంధామా ధ్యానంనారాయణఃపరః।
నారాయణఃపరోధర్మో నారాయణనమోస్తుతే॥

౪. నారాయణఃపరోదేవో విద్యానారాయణఃపరః।
విశ్వంనారాయణఃసాక్షా న్నారాయణనమోస్తుతే।

౫. నారాయణఃద్విధిజాతో జాతోనారాయణాద్భవః।
జాతోనారాయణాదింద్రో నారాయణనమోస్తుతే॥

౬. రవిర్నారాయణస్తేజః చంద్రోనారాయణోమహః।
వహ్నిర్నారాయణస్సాక్షా నారాయణనమోస్తుతే॥

౭. నారాయణ ఉపాస్యా గురుర్నారాయణపరః।
నారాయణపరోబోధో నారాయణనమోస్తుతే॥

౮. నారాయణపరంముఖ్యం సిద్ధిర్నారాయణస్సుఖమ్।
హరనారాయణశ్శుద్ధి నారాయణనమోస్తుతే॥

౯. నారాయణాపరబ్రహ్మ లక్ష్మీకాంతంపరాత్పరం।
అప్రమేయంసురానందం నమోవ్యక్తం దిగంబరమ్॥

౧౦. నారాయణాపరంబ్రహ్మ నారాయణంపరంతపః॥
నారాయణాపరంక్షేమం సర్వనారాయణాత్మకం॥

౧౧. నారాయణాక్రియాతీతం నిస్సంగం దేవవందితమ్।
నారాయణంశివంశుద్ధం దృశ్యవర్ణవవందితమ్॥

౧౨. నారాయణాయభక్తాయ ఏకనిష్ఠాయశాశ్వతే।
హృదిస్థాయచభూతానాం సర్వేషాంచమహాత్మనే॥

అవసానకాలంబున శ్రీనారాయణ స్తోత్రముచేయుచు నా

రాయణునియందు మనస్సులయ మొందించి విడుచుటే ముక్తి యని గ్రహించవగు.

క॥ నానాప్రియ నారాయణ । నామకవిశ్వాద్యనంత నామార్థ
జ్ఞా । నామప్రభావదర్శక । నామాదివికారరహిత నతబుధ
విహితా॥

క॥ ఈకతత్కృతి గీతార్థంబును । వ్రాశియుజదివినను విన్నవారికి
కిభువిలో । క్లేశంబడంగిసద్గతి । శాశ్వతమైదనరుచుండు శ
ర్వానికరుణన్॥

చ॥ చదివినవారికిన్ గలుగు సంపదసౌఖ్యము లాయువృద్ధియున్ ।
కుదురుసుజ్ఞానయోగసుఖ గుప్తములిందున నిర్భయంబులై ।
వదలవరాపరంబునకు బ్రాకెడుభావజితేంద్రి యాత్మలో
విదితవిధిజ్ఞులై భువిని విజ్ఞులులై విహరింతురెప్పుడున్ ।

మోక్షాపేక్షగలవారీగ్రంథమునందలి రహస్యములను సద్గురూపదేశంబున గ్రహించి బ్రహ్మానంద సుఖమనుభవించు చుండెదరుగాత.

—[*] మంగళము. [*]—

క॥ మంగళమిదే గురుమూర్తికి । మంగళముదాత్తభక్తహృదయ
మందిరునకును। మంగళముప్పొంగ మానికి। మంగళమద్వై
తయోగ మహితునకున్॥

—[*] కందార్థము. [*]—

మంగళము నిర్వికారికి । మంగళమునకోట్ల విహిత మహితాత్మునకున్ । మంగళము సచ్చిదాత్మకు । మంగళమున నన్య

చిద్రూ! పళ్లని దేవునకు, పరాత్పరుడా, వేదవేద్యునకు॥ ఆది
గాంత్యము లేక నమరిచిన్మంటను। నాదాంతరంగుడా వటనసం
పూర్తికి। భేదబుద్ధివిరహిత రేచక భిన్నపూరక కుంభకాక్యవి।
నాదజాంతస్థ్సక్య హిమకర వహ్నిసూర్య సురూపచిద్రూ! హ్మో
ట దేవునకు, పరాత్పరుడా, వేదవేద్యునకు।

—[*] మంగళము. [*]--

౧. పార్వతీరమణునకు పరదేవదేవునకు । పరమచిత్కళ
రూప పవిత్రాంగునకూ॥ పరగ చిదాకాశ ప్రత్యక్షపదవిలో। ప్ర
గాశుడై యున్నయా పరమేశునకూ॥ జయమంగళం నిత్యశుభ
మంగళం॥ జయాజయమంగళం। మనోన్మయమండలం॥

౨. రవిచంద్రనేత్రునకు రజతాద్రివాసునకు । భువనమో
హనరుద్ర। పురహరునకూ॥ భవబంధములనెల్ల భారమందైద్రుం
చి భవికరక్షకమోక్ష భవునకిపుడూ॥ జయమంగళం నిత్యశుభ
మంగళం। జయా జయమంగళం। మనోన్మయ మండలం॥

3. హితముగా దృక్ దృశ్య మతముతాగానట్టి। పతితాపా
వనరుద్ర పశుపతియకూ। సతతిగ పిండాండ సరణిలో బ్రహ్మాండ
వినతిశవ్యలి వెలుగు విమథునకూ॥ జయమంగళం నిత్య శుభ
మంగళం॥ జయా జయమంగళం మనోన్మయ మండలం॥

౪. అకలంకభావునకు నాదిపరంజ్యోతికిని । నికరమైవెన్గెదు
నిర్మలునకూ। ప్రకటితంబయినట్టి ప్రజ్ఞానబ్రహ్మకళ పరబయలు
తానగు పాలాక్షునకూ । జయమంగళం నిత్య శుభమంగళం ।
జయా జయమంగళం। మనోన్మయ మండలం॥

౫. ఏకాక్షరేశునకు ఎరుకప్రతాపునకు। నాకమనాదియా నందీశునకూ॥ ఏకమానట్టియా ఏకాంతమందిరము॥ దాకిదాకని యట్టి ధవళాంగునకూ। జయమంగళం నిత్యశుభమంగళం। జయా జయమంగళం మనోన్మయ మండలం॥

౬. మంగళంగురుశిష్య మార్గబోధాన్యునకు। మంగళంనాసింహ మన్మయునకూ। మంగళంగిరిపైని మహాలింగ తేజునకు। మంగళంపరశివా మననమునకూ। జయమంగళం నిత్యశుభ మంగళం। జయా జయమంగళం। మనోన్మయమండలం॥

— గద్య. —

శ్రీమన్నారీపుత్రవంశ పయఃపారావార రాకా సుధాకరా యమాన శ్రీవిష్ణుగోత్ర సంభూత ముత్యాల- రామస్వామి యోగి పుత్రుండును కుప్పమాంబా గర్భ శుక్తి ముక్తిక ప్రాయుండును శ్రీ లక్ష్మీ నృసింహస్వామి వర ప్రసాద లబ్ధాధ్యాత్మ విద్యావిశారదుండును శ్రీమార్గ - వైవశిఖామణియును దిగంబరేశగురు ప్రియ శిష్యుండును నగు ముత్యాల- నారసింహయోగీంద్ర ప్రణీతంబైన సుజ్ఞానతత్త్వ పూర్ణోదయంబను బ్రహ్మగీతా రహస్య గ్రంథరాజంబునందు సర్వంబును సంపూర్ణము.

---

# శుద్ధపత్రిక.

| పేజి. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. | పేజి. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | ౭ | సర్వ్యాయ | శర్వ్యాయ | ౪౮ | ౭ | యుంరు | యుందు |
| ౪ | ౪ | యునది | యున్నది | ౫౧ | ౫ | అనిస | ఆనిస |
| ౫ | ౧౫ | వినుమ | వినుము | | ౧౫ | బోవుచు | బోవ్రసు |
| ౬ | ౧ | ముతల | ముతల | ౫౨ | ౨౧ | యగణమా | యగణః మా |
| | ౨౧ | తెలంపె | తెలంపే | ౫౩ | ౭ | యది | య్యది |
| ౧౧ | ౫ | మించక | మించగ | | ౧౨ | శివుసుగా | శివుడుగా |
| ౧౪ | ౧ | నిట్టి | ఇట్టి | | | ని | డు |
| | ౯ | వీవ | ఠీవ | ౫౮ | ౧౨ | గురవు | గురు |
| ౧౫ | ౭ | దయ | దయము | ౫౬ | ౮ | శ | శ్రీ |
| | ౨౦ | పావగ | పాసగ | | ౧౮ | వృద్య | పృథ్వి |
| ౧౬ | ౧౬ | గుట్టు | గట్టు | ౫౭ | ౩ | ౨౫౫ | ౨౫ |
| ౧౮ | ౬ | గ్రసించీ | గ్రసించి | ౫౯ | ౧౦ | సద్యా | సద్యో |
| ౨౦ | ౨౦ | చెద | బెడ | | ౧౧ | ౧౩-౧౪-౧౫ | ౩-౪-౫- |
| ౨౨ | ౧౯ | పోయిన | పోయితిన | | | | |
| ౩౬ | ౧ | బ్రహ్మం | ఇంబ్రహ్మం | ౬౦ | ౧ | శుద్ధి | శుధ |
| ౩౭ | ౧౮ | మను | మును | | ౨౧ | స్తువుతే | స్తువే |
| ౩౮ | ౭ | లక్ష్మ్యాక | లక్ష్మ్యాదు | ౬౩ | ౫ | యగ | యగుని |
| ౪౨ | ౧౮ | సుఖాద్య | సుఖాద్య | | ౧౮ | నిభిల | నిఖిల |
| | ౨౧ | వారతే | వాజే | ౬౫ | ౧౦ | నుందు | నుండ |
| | ౨౨ | కులవులు | కులవు | | ౨౧ | మునే | మనే |
| ౪౪ | ౨౨ | జానము | జ్ఞానము | ౬౬ | ౧౩ | చిద్ఘాగ | చిద్ఘన |
| ౪౫ | ౧౬ | చక్తి | భక్తి | ౬౮ | ౧౮ | బాందిక | చాంద్రిక |
| ౪౬ | ౧౩ | లేదు | లేము | ౬౯ | ౪ | శూన్యాని | శూన్యంవి |

## శుద్ధాశుద్ధపత్రిక.

| పేజి. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. | పేజి. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|---|---|---|
| ౭౯ | ౧౦ | సుఫా | సుఖా | ౧౧౨ | ౧౭ | లిను | విను |
| ౮౪ | ౫ | గాపా | గాని | ౧౧౪ | ౧౯ | నుండె | నూడై |
| | ౧౭ | వ టుక | వంటుక | ౧౧౯ | ౧౧ | త్యం | త్వం |
| ౮౬ | ౭ | సుసు | సు | ౧౨౫ | ౧౨ | శాంచి | శాంచ |
| ౬౭ | ౧౨ | నాగ్ర | గాగ్ర | ౧౨౭ | ౧౮ | ముల | ముఖ |
| | ౧౩ | వాడించ | యాచించు | ౧౨౮ | ౧ | వాపి | వ్యాపి |
| ౯౩ | ౨౦ | ముల | మున | ౧౩౦ | ౧౧ | మనో | మనో |
| ౯౪ | ౧౦ | శేయు | శాదు | | ౧౬ | మంపలి | మండల |
| | ౧౨ | మృత్తి | వృత్తి | ౧౩౮ | ౨౦ | నాహా | నాహం |
| ౧౦౨ | ౧౮ | క్రమము | క్రమమ | ౧౪౦ | ౨ | ముచే | మంది |
| ౧౦౩ | ౧౩ | ధరడ | ధీరుడ | ౧౪౨ | ౨౨ | యువమ | యుపము |
| ౧౦౪ | ౫ | సుషి | సుషు | ౧౪౩ | ౧౩ | మయిక్య | ఐక్య |
| ౧౦౫ | ౧౩ | యుందు | యందు | ౧౪౪ | ౫ | కూర్ఛ | కూర్చ |
| | ౧౫ | టెట్లన | నెట్లన | ౧౪౫ | ౧౩ | నించి | నించ |
| ౧౦౬ | ౧ | పధా | ప్రధా | | | | |

## ప్రకటన.

ఇవి మొదలయిన సంస్కృతాంధ్ర గ్రంథములు వలయు వారలు చెన్నపట్టణము పాతచాకలపేటయందుండు శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలాధికారియగు పమ్మి-త్యాగరాయసెట్టిగారికి వ్రాసి పోస్టుద్వారా తెప్పించుకొనవచ్చును.